శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# పురుషసూక్తమ్ - సవ్యాఖ్యానమ్

(ఉ.వే.శ్రీమాన్ ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారి
తమిళ వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదం)



అనువక్త:

'పండిరత్న' ఉ.వే. శ్రీమాన్

డా॥ ఈయుణ్ణి అ/ూగ శింగరాచార్యులు

ప్రకాశకులు:
ఉ.వే.శ్రీమాన్ నల్లందిఘళ్ విజయరాఘవాచార్యులు,
ఉ.వే.శ్రీమాన్ నల్లందిఘళ్ శ్రీధరాచార్యులు

నల్లందిఘళ్ రాధా తిరువేంగళమ్మ గారి

పవిత్రస్మృతి చిహ్నిక

08, నవంబరు 2021



(పురుషసూక్తానికి తమిళ వ్యాఖ్యానాన్ని అనుగ్రహించిన మహానుభావులు

'శ్రీవైష్ణవ సింహ' కీ.శే. ఉ.వే.శ్రీమాన్ ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారు)

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# పురుషసూక్తమ్ - సవ్యాఖ్యానమ్

(ఉ.వే.శ్రీమాన్ ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారి
తమిళ వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదం)

అనువక్త:

'పండిరత్న' ఉ.వే. శ్రీమాన్
డా॥ ఈయుణ్ణి అ*ళ*గ శింగరాచార్యులు


ప్రకాశకులు:
ఉ.వే.శ్రీమాన్ నల్లందిఘళ్ విజయరాఘవాచార్యులు,
ఉ.వే.శ్రీమాన్ నల్లందిఘళ్ శ్రీధరాచార్యులు

నల్లందిఘళ్ రాధా తిరువేంగళమ్మ గారి
పవిత్రస్మృతి చిహ్నిక

08, నవంబరు 2021

# పురుషసూక్తమ్ - సవ్యాఖ్యానమ్

**అనువక్త - పండిరత్న, డా॥ శ్రీమాన్ ఈయుణ్ణి అ॥గ శింగరాచార్యులు**


ప్రథమ ముద్రణము - 8, నవంబరు 2021

ఆవిష్కరణము - 8, నవంబరు 2021

ప్రతులు - 200

వెల - అమూల్యము

ముఖచిత్రం - శ్రీమన్నారాయణుడు


**ఈ గ్రంథం, నల్లందిఘళ్ రాధా తిరువేంగళమ్మ గారి దివ్యస్మృతిగా**
**వారి కుమారులు ఉ.వే.శ్రీమాన్ నల్లందిఘళ్ విజయరాఘవాచార్యులు,**
**ఉ.వే.శ్రీమాన్ నల్లందిఘళ్ శ్రీధరాచార్యులు గార్లచే**
**భగవద్భాగవతాచార్య కైంకర్యరూపంగా ముద్రింపబడింది**


**ప్రతులకు:**

Sri N.V.R.Chary, 239/A, Convent Lane,
Chintal Bazar, Bolarum,
Secunderabad 500 010
Mobile# 9849527192

డి.టి.పి. : శ్రీమతి జయలక్ష్మి, తిరుపతి

ప్రింటింగ్ : కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాదు

# విషయసూచిక



## పూర్వానువాకమ్

## ఉత్తరానువాకమ్



## అనుబంధం





శ్రీమతే రామానుజాయ నమః

# కృతజ్ఞతా నివేదనము

08-11-2021 నాడు మా అమ్మగారి సంవత్సర విమోకం. ఆచార్య తిరువడి చేరిన మా అమ్మగారు **నల్లందిఘళ్ రాధా తిరువేంగళమ్మ గారు**. ఏలూరు చిలకమర్రి వారింటి ఆడబడుచు. **శ్రీమత్ పరమహంస పరివ్రాజకులు, సత్య సంకల్పులైన శ్రీశ్రీశ్రీ పెద్దజీయరు వారి** తిరువడి సంబంధురాలు. ప్రపన్నుల ఇంటి ఆచార వ్యవహారములు చక్కగా తెలిసి, అతిథి అభ్యాగతుల సమారాధన ఎరిగిన వ్యక్తి అమ్మగారు. ఇక, మా తండ్రిగారు హైదరాబాదు బొల్లారం వాస్తవ్యులు, పరమపద వాసులైన **శ్రీమాన్ నల్లందిఘళ్ నరసింహాచార్యులు.** వారికి సహధర్మచారిణిగా తమ జీవిత సేవలందించి తరించిన వారు మా అమ్మగారు.

తీర్చుకున్నా తీరనిది కదా ఋషి ఋణం! సంవత్సర విమోకం సందర్భంగా ఒక సద్గ్రంథాన్ని ముద్రించాలని భావించి ప్రార్థించగా, ఈ **"పురుష సూక్త"** వ్యాఖ్యాన గ్రంథాన్ని శ్రీమాన్ శింగరాచార్య స్వామివారు అనుగ్రహించడం మా భాగ్యం. మమ్మల్ని పెంచి, పెద్ద చేసి సంస్కారవంతులుగా తీర్చిదిద్దిన మా తల్లిగారి ప్రథమ తిరువధ్యయనం సందర్భంగా ఈ గ్రంథాన్ని ఇలా కైంకర్యరూపంగా భాగవతగోష్టికి సమర్పించుకుంటున్నాము.

వేదోక్తమైన ఈ సూక్తాన్ని వ్యాఖ్యానించి, అందులో అనేక విశేషాంశాలు కూర్చి, భావితరాలకు అందజేస్తున్న పండితులు, మేము చిన్నవారమే అయినా మా యందు ఎల్లప్పుడు అపారమైన వాత్సల్యాన్ని కలిగినవారు, ఆచార్య శ్రేష్టులు అయిన ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి అ*ழ*గ శింగరాచార్య స్వామివారికి మా కుటుంబమంతా సాష్టాంగ ప్రణామములు కృతజ్ఞతాపూర్వకముగ అర్పించుకొనుచున్నాము.

విన్నపాలతో -

అడియేన్ రామానుజ దాసులము
**నల్లందిఘళ్ విజయ రాఘవాచార్యులు,**
**నల్లందిఘళ్ శ్రీధరాచార్యులు**



# విజ్ఞాపనం

**దేవం పురుషసూక్తేన వినుతం విశ్వరూపిణమ్,**
**శ్రీమన్నారాయణం నౌమి జగదానందకారిణమ్.**

సమస్త భారతీయవిజ్ఞానానికి మూలం వేదాలు. అన్ని శాస్త్రాలకు వేదమే మూలమని విజ్ఞుల అభిప్రాయం. ఆ విధంగానే పరవిద్య అనబడే భారతీయ వేదాంతశాస్త్రానికి సంబంధించిన మూలం కూడా వేదాలలోనే దర్శించవచ్చు. వేదాంత విజ్ఞానికి సంబంధించిన సాహిత్యం మనకు వేదంలో ప్రచురంగా కనిపిస్తుంది. అటువంటి సాహిత్యంలో పురుషసూక్తం ఒకటి వేదంలో పలు దేవతామూర్తుల స్వరూప స్వభావాలను మనకు తెలియజెప్పే సూక్తాలు అనేకం ఉన్నాయి. పురుష సూక్తం సర్వవ్యాపి, సర్వజ్ఞుడు, సర్వశక్తి అయిన విరాట్పురుషుని వైభవాన్ని, సృష్టిక్రమం మొదలైన విషయాలను మనకు తెలియజేస్తున్నది. ఈ సూక్తం నాలుగు వేదాలలోను ఉన్నది.

ఈ సూక్తంలోని విషయాలను శ్రుతీతిహాసపురాణాది వాఙ్మయం పలుచోట్ల ఉపబృంహణం చేసింది. ఉదాహరణకు మహాభారతంలో గల శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రంలోని కొన్ని నామాలు పురుషసూక్త ప్రతిపాద్యమైన విరాట్ పురుషుని వైభవాన్ని చూపిస్తున్నవి అని సర్వజ్ఞులైన శ్రీపరాశర భట్టర్ వ్యాఖ్యానించారు. **"సహస్రమూర్ధా, సహస్రాక్షః, సహస్రపాత్, విశ్వాత్మా"** అనే నామాలను కలిపి వ్యాఖ్యానిస్తూ **"అథ, ఏతద్విద్యావతారోజ్జీవితాసు పురుషసూక్తాద్యాసు పరవిద్యాసు యథా ప్రతిపాద్యతే తథా?నురూపాణి నామాని సహస్రమూర్ధాదీని"** (వేదవిద్యను ఉద్ధరించిన మత్స్యావతారం చేత మళ్లీ ఉజ్జీవింపజేయబడిన పురుషసూక్తం మొదలైన మంత్రాలలో ప్రతిపాదించబడ్డ రీతిలో పరబ్రహ్మయొక్క ఉపాసనలో నిరూపింపబడిన భగవంతుని స్వరూప విశేషాలు, ఆ పురుషసూక్తం మొదలైనవానికి అనుగుణంగా "సహస్రమూర్ధా" ఇత్యాదినామాలతో తెలుపబడుతున్నవి) అని వివరించడం దీనికి ఒక ఉదాహరణ. పురుషసూక్తంలో

విరాట్పురుషుని రూపాన్ని వర్ణిస్తూ **"సహస్రశీర్షా"** ఇత్యాదినామాలలో ప్రయోగింపబడిన సహస్రశబ్దంలోని తాత్పర్యాన్ని వివరించేటప్పుడు భట్టర్ **"సహస్రశబ్దశ్చ తేషా మసంఖ్యేయత్వపరః ... ఆభ్యాం జ్ఞానశకనాభ్యాం విశ్వవ్యాపనాత్"** (ఇక్కడ "సహస్ర" అని వేయి అనే అర్థాన్ని చెప్పే పదం అనేకం అనే అర్థంలో ప్రయోగింపబడినది. భగవంతుడు తన జ్ఞాన, శక్తి గుణాలతో అంతటా వ్యాపించి ఉన్నాడు) అని వివరించారు. "విశ్వాత్మా" అనే నామాన్ని వివరించేటప్పుడు కూడా భట్టర్ **"స భూమిం విశ్వతో వృత్వా"** అనే పురుషసూక్తవాక్యాన్ని ప్రమాణీకరించారు.

ఆ విధంగానే హారీతస్మృతిలో **"యజ్ఞసిద్ధ్యర్థ మనఘాన్ బ్రాహ్మణాన్ ముఖతోఽ సృజత్, అసృజత్ క్షత్రియాన బాహ్వోః వైశ్వానప్యూరుదేశతః"** ఇత్యాదిగా పురుషసూక్తంలో చెప్పబడిన నాలుగు వర్ణాల సృష్టి క్రమాన్ని తెలియజెప్పింది. ఈ విధంగానే ఇంకా పలు స్మృతులు, పురాణాలు పురుష సూక్తంలో ప్రతిపాదించబడిన అంశాలను వివరించాయి. దివ్య సూరులు కూడా పురుషసూక్తంలో ప్రతిపాదించబడిన విషయాలను తమ దివ్యప్రబంధ సూక్తులలో పలచోట్ల అనుసంధించారు. భగవంతుడు వేయి పాదాలను, వేయి కన్నులను, వేయి తలలను కలవాడు అనే విషయాన్ని నమ్మాళ్వారులు **"తోళ్ కళ్ ఆయిరత్తాయ్ తుణైమలర్కణ్ గళ్ ఆయిరత్తాయ్ తాళ్ కళ్ ఆయిరత్తాయ్"** అని తిరువాయ్‌మొళి ప్రబంధంలో తెలియజేశారు, పురుషసూక్తం నాలుగు వేదాలలో ఉన్నది అనే సంగతిని భక్తిసారమునులు **"మఱైకొండ మందిరత్తాల్ వాళ్త్తి"** (వేదాలలో అంతర్భవించిన మంత్రంతో మంగళాశాసనం చేసి) అని సూచించారు. ఇంతేకాక, ఈ దివ్యసూరిసూక్తివల్ల భగవంతుని అభిషేక సమయంలో ఈ పురుషసూక్తం పఠింపబడడం సూచింపబడింది. ఈ క్రమం ఈనాటికీ ప్రత్యక్ష సిద్ధం. ఈ విధంగా అళ్వార్లు తమ ప్రబంధాలలో పురుష సూక్తంలోని అర్థాలను అనుసంధించిన వైనాన్ని మన పూర్వాచార్యులు దివ్యప్రబంధ వ్యాఖ్యానాలలో పలుచోట్ల సూచించారు. ఇవి అన్నీ సంస్కృత వేదాంత, ద్రావిడ వేదాంతార్థాల ఐకకంఠ్యానికి నిదర్శనాలు.

ఈ పురుషసూక్తానికి అనేక వ్యాఖ్యానాలు పలు భాషలలో

వచ్చాయి. ఆయా సంప్రదాయాలకు సంబంధించిన పెద్దలు తమ సంప్రదాయానికి అనుగుణంగా ఈ సూక్తాన్ని వ్యాఖ్యానించారు. కానీ, ఇంతవరకు ఉభయవేదాంత సమన్వయక్రమంలో వ్యాఖ్యానం తెలుగులో వెలువడలేదు. తమిళంలో **శ్రీవిష్ణుచిత్తవిజయం** అనే గొప్ప గ్రంథాన్ని రచించిన సుప్రసిద్ధ పండితులు, కీర్తి మూర్తులు, **శ్రీ వైష్ణవ సింహ, ఉ.వే. శ్రీమాన్ ఎస్ కృష్ణ స్వామి అయ్యంగార్**. అందులో ఉభయవేదాంత సమన్వయ ప్రక్రియలో పలు విశేషాలను తెలుపుతూ తమిళంలో ఒక చక్కని వ్యాఖ్యానాన్ని రచించారు. అందులో, పురుష సూక్తంలో విశిష్టాద్వైత సిద్ధాంత తత్వం ప్రతిపాదించబడిన రీతిని సప్రమాణంగా వివరించారు. ఆ వ్యాఖ్యానం ఇప్పుడు ఆంధ్రీకరింపబడి, ప్రపన్నగోష్ఠికి సమర్పింపబడుతున్నది. ఈ గ్రంథంలో ముందుగా విష్ణుచిత్తవిజయ గ్రంథంలో **శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యంగార్ స్వామి** ప్రస్తావించిన "పురుషసూక్తంలో సర్వరక్షకనిర్ణయం" అనే వ్యాసం చేర్చబడింది. తమిళ వ్యాఖ్యానాన్ని ఆంధ్రీకరించడానికి అంగీకరించిన **శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారి** సన్నిధిలో అనేక కృతజ్ఞతలను దాసుడు సమర్పించుకుంటున్నాడు. ఆ విధంగానే, ఈ తెలుగుసేతను తమ మాతృమూర్తి **నల్లందిఘళ్ రాధా తిరువేంగళమ్మ గారి** పవిత్రస్మృతిగా ముద్రించడానికి ముందుకు వచ్చిన మిత్రవర్యులు, సహృదయులు, **ఉ.వే.శ్రీమాన్ నల్లందిఘళ్ విజయరాఘవాచార్య స్వామి, ఉ.వే.శ్రీమాన్ నల్లందిఘళ్ శ్రీధరాచార్య స్వామివార్లను** మనసారా అభినందిస్తున్నాను. అనువాద ప్రయత్నంలో నాకు సహకరించిన చిరంజీవి, కుమారుడు, శ్రీమాన్ అనంత రంగ రామన్‌కు అనేక మంగళాశాసనాలు. స్వస్తి.

**సేయం పురుషసూక్తస్య వ్యాఖ్యా భక్త్యా సమర్ప్యతే,**
**శ్రీమన్నారాయణాతామ్రపదాంభోజాతయుగ్మకే.**



భాగవత దాసుడు
**ఈయుణ్ణి అ*ప్పా*గ శింగరాచార్యులు**





శ్రీమతే రామానుజాయ నమః

# పురుషసూక్తంలో సర్వరక్షక నిర్ణయం

వేదాంతాలలో చాలా గొప్పది అయిన పురుష సూక్తంలో మొదటి మంత్రం, 'రక్ష్యవస్తువు అయిన ఈ జగత్తును రక్షించాలనే ఆశ, రక్షకుడైన ఆ భగవానునకు చాలా ఎక్కువ. అది రక్ష్య వస్తువు అయిన జగత్తు యొక్క పరిమితిని మించి ఉన్నది' అని తెలుపుతున్నది.

**(సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాద్)** - పరమ పురుషుడ వేయి శిరస్సులను, వేయి కన్నులను, వేయికాళ్లను కలవాడు. భక్తులను రక్షించడానికి తగిన అంతులేని జ్ఞాన శక్తులను కలవాడు.

**(స భూమిం విశ్వతో వృత్వా)** - అతడు భూమిని అన్ని వైపులా వ్యాపించాడు. ఒకనిని పట్టుకోవాలని తలచి, ఊరిని అంతటిని చుట్టుముట్టినట్లుగా, 'ఏవనినైనా ఒక చేతనుని పొందగలనా!' అనే ఆశతో లోకాన్ని అంతటినీ అతడు వ్యాపించాడు, ఇంత మాత్రమేనా? కాదు.

**(అధ్యతిష్ఠత్ దశాంగులమ్)** - పది అంగుళాలను మించి అధికంగా వ్యాపించాడు. రక్ష్యవస్తువు అయిన జగత్తుయొక్క పరిమితికి మించి రక్షకుడైన భగవానుని ఆశ ఉన్నది అని దీని అర్థం.

పురుషసూక్తంలోని రెండవ మంత్రం ఈ లోకంలో ఉండేవారికి అన్నాన్ని, ఆ లోకానికి వెళ్ళేవారికి మోక్షాన్ని ఇచ్చేవాడు పరమ పురుషుడే అని తెలుపుతున్నది. సకల ఫలాలను ఇచ్చేవాడు విష్ణువే అని దీని భావం.

**(పురుష ఏవేదం సర్వం యద్భూతం యచ్చ భవ్యం యదన్నేనాతిరోహతి)** - అతడు ఇచ్చే అన్నంతో మరణించకుండా ఉన్నది, గడచిన వర్తమాన రాబోయే కాలాలు మూడింటిలో ఉండే లోకం పరమ పురుషుడే. దీనివల్ల తాను అంతర్యామిగా అన్నిటిలోనూ నిలచి, వాటి సత్తను రక్షించడంతో నిలువకుండా, లోకానికి అన్నాన్ని ప్రసాదించి, రక్షించేవాడు పరమపురుషుడే అని తెలుస్తున్నది. ఈ లోకానికి కేవలం అన్నాన్ని పెట్టడం మాత్రమేనా? అని అంటే,

**(ఉతామృతత్వేశానః)** - పైలోకంలోనూ మోక్షమనే అనుభవం అనే అన్నాన్ని కూడా ప్రసాదించేవాడు ఇతడే అని భావం. ఈ లోకంలో అన్నాన్ని ప్రసాదించడమే కాక, ఆ లోకానికి వెళ్లినా "అహమన్నాదః" (నేను పరమ పురుషుని ప్రీతి అనే అన్నాన్ని అనుభవించేవాడను) అని అనేటట్లు చేసేవాడు ఇతడే.

**(అమృతత్వేశానః పురుషః)** - భగవంతుడు అని లోకంలో ఈశ్వరుడు అని లోకంలో ప్రసిద్ధి పొందిన ఆ శివుడు కాదు ఇతడు. మోక్షఫలానికి సాక్షిగా, దానిని పొందడంలో సహాయపడేవాడుగా ఉండే శివునివలె కాక, ఆ మోక్షాన్ని నేరుగా ఇచ్చే ప్రభువు ఇతడు. ఇందువల్ల ఈ మంత్రంలో అందరి జీవులకు వారు వారు కోరే ఫలాలను ఇచ్చి, రక్షించేవాడు అచ్యుతుడే అని తెలుపబడినట్లయినది.

మూడవ మంత్రలో ఇహలోకంలోని ఆనందాలను, ఆ లోకంలో పొందే మోక్ష రూపమైన మహానందాన్ని అనుభవింపజేసే స్థానాలైన ఉభయ విభూతులను కలవాడు ఇతడే అని తెలుపబడుతున్నది.

**(పాదోస్య విశ్వాభూతాని)** - ఈ లోకం అంతా అతని సంపదలో నాల్గవ భాగం మాత్రమే. ఆ సంపదలో మూడు భాగాలు పరమపదంలో ఉన్నవి. రక్షణ స్థానాలు అయిన ఉభయ విభూతులను కలవాడు ఇతడే అయినందున, ఇతడే రక్షకుడు అనే విషయం తెలుపబడుతున్నది.

నాల్గవ మంత్రంలో పరమ పురుషుడు తాను పరమపదంలో నిత్యసూరులకు నిర్వాహకుడై ఉండే స్థితిని లెక్కపెట్టకుండా, తన రక్షణధర్మం ప్రకాశించడంకోసం, **"ఉయరళిప్పాన్ ఎన్నిల్ల యోనియుమాయ్ పిఱందాయ్"** అనే విధంగా ఈ లోకంలోని జీవులను రక్షించడంకోసం ఎన్నెన్నో జన్మలను ఎత్తి అవతరించేవాడు ఇతడే అని తెలుపబడుతున్నది.

**(ఉర్ధ్వః పురుషః)** - ఊర్ధ్వలోకం అయిన పరమపదంలో ఉండే పరమపురుషుడు అని అర్థం. రక్షణలోని ఆసక్తిచేత ఉన్నతంగా ఉండేవాడు తనను తక్కువగా చేసికొని అవతరించాడు అని దీనివల్ల తెలుపబడుతున్నది.

**(త్రిపాద ఉదైత్)** - ప్రద్యుమ్నుడు, సంకర్షణుడు, అనిరుద్ధుడు అనే మూడు అవతారాలను కలవాడనై, ఈ లోకాన్ని అంతటిని రక్షిస్తాను అని సంకల్పించాడు.

**(పాదోసస్యేహాభవాత్ పునః)** - ఇతని ఒక అవతారమైన అనిరుద్ధుడు ఇక్కడ మళ్ళీ అవతరించాడు. ఈ విధంగా అవతరించడం ఒకటి, రెండు అవతారాలేనా? అని అంటే,

**(తతో విష్వజ్ వ్యక్రామత్ సాశనాశనే అభి)** దానికి తరువాత, అన్నాన్ని భుజించే దేవమనుష్యాదుల కోసం, అన్నాన్ని భుజించని శిలలుగా, కాష్ఠాలుగా ఉండే చేతనులకోసం ఎన్నెన్నో జన్మలను ఎత్తాడు అని భావం.

ఈ విధంగా ఆరంభంలో జీవులకు అంతర్యామి ఉండి, వారు వారు కోరే ఫలాలను ఇచ్చి, అవతారాలను ఎత్తి, రక్షించేవాడు పురుషోత్తముడే అని నిర్ణయించి, ఉపసంహారంలో కూడా ఈ అర్థాలను మళ్లీ ఈ పురుషసూక్తం ప్రతిపాదించింది.

**(తమేవం విద్వాన్ అమృత ఇహ భవతి నాన్య పంథా విద్యతేయనాయ)** ఆదిత్యవర్ణుడైన ఆ మహాపురుషుని ఈ విధంగా తెలిసినవాడు ఈ జన్మలో మోక్షాన్ని పొందుతున్నాడు, మోక్షాన్ని పొందడానికి ఇంకొక దారి లేదు? అని

మోక్షఫలాన్ని ఇచ్చేవాడు ముకుందుడే అని నిర్ణయించింది.

**"ప్రజాపతిశ్చరతి గర్భే అంతః"** అని అంటూ అంతర్యామియై ఉండి, రక్షించేవాడు నారాయణుడే అని తెలిపింది, "అజాయమానో బహుధా విజాయతే" (కర్మ మూలకంగా జన్మ లేనివాడు అయినా, కృపవల్ల అనేక విధాలుగా పరమపురుషుడు జన్మిస్తున్నాడు) అని, అవతరించి రక్షించేవాడు అచ్యుతుడే అని ఘోషించింది. **"హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ...ఇష్టం మనిషాణ ఆముం మనిషాణ సర్వం మనిషాణ"** (నీకు శ్రీదేవి భూదేవులు పత్నులు... నాకు ఇష్టాన్ని ఇవ్వాలి, ఈ కైంకర్యానికి ఇవ్వాలి, అన్నిటినీ ఇవ్వాలి) అని లక్ష్మీదేవితో కూడిన పరంధాముడే ఈ విధంగా సర్వ రక్షకుడుగా, సకల ఫలాలను ఇచ్చేవాడుగా అవుతున్నాడు - అని నిశ్చయించి పలికింది. ఈ విధంగా లక్ష్మీనాథుడైన పరమపురుషుని ఒక్కనిమాత్రమే ప్రతిపాదించే ఈ పురుష సూక్తంవల్ల నారాయణుడే సర్వరక్షకుడు, సకలఫలప్రదుడు అని నిర్ణయింపబడినది.





శ్రీమతే రామానుజాయ నమః

# పురుషసూక్తవైభవమ్

పురుషసూక్తం అన్ని వేదాలలో అధ్యయనం చేయబడుతున్నది. ఈ పురుషసూక్తాన్ని స్తుతించని పెద్దలు లేరు. గొప్ప పాతకాలకుకూడా ప్రాయశ్చిత్తంగా ఈ పురుషసూక్తాన్ని జరిపించాలని చెప్పబడింది. పురుషసూక్తంతో విష్ణుయాగం చేస్తే లోకం వృద్ధిచెంది వెలుగుతుంది అని చెప్పబడింది. వేదంలో 'సమర్థులైన బ్రాహ్మణుని వధించినా, పురుష సూక్తాన్ని నీటిలో ఉండి జపిస్తే, ఆ పాతకం నశిస్తుంది' - అని దీని మహిమలో చెప్పబడింది. పురుషసూక్తంతో శ్రీమన్నారాయణుని ధ్యానించి హోమం చేస్తే అన్ని పాపాలనుండి విముక్తుడై మోక్షాన్ని పొందుతాడు అని ఋషులు విస్తృతంగా పలికారు. పురుష సూక్తంలోని అర్థం ముద్గలోపనిషత్తులో, పురుష సంహితలో తెలుపబడింది. విష్ణుపురాణంలో ధ్రువుడు భగవంతుని స్తోత్రం చేసేటప్పుడు పురుష సూక్తాన్ని మనసులో పెట్టుకొని స్తోత్రం చేసినట్లు విశిష్టాద్వైతసిద్ధాంతంలో నిపుణులైన ఎంగళాళ్వాన్ అనే ఆచార్యులు విష్ణుపురాణవ్యాఖ్యానంలో తెలిపారు. కూరేశులు, భట్టర్, దేశికులు మొదలైన విశిష్టాద్వైత సంప్రదాయంలోని పూర్వాచార్యులు పురుషసూక్తమహిమను తెలియజేశారు.

జగత్కారణం శ్రీమన్నారాయణుడు. అతనినుండి ఈ లోకం పుడుతున్నది. అతడే లోకహితంకోసం వేదాలనే దీపాలను అజ్ఞానమనే చీకటిని పోగొట్టుకోవడం కోసం ఇస్తున్నాడు. అతనిని ఆచార్యుని ద్వారానే తెలియడానికి సాధ్యం. అతనిని పొందడానికి భక్తి, ప్రపత్తి అనే రెండు దారులు ఉన్నాయి, ఈ రెండు దారులు తప్ప వేరుదారిలో అతనిని పొందడం వీలు కాదు.

భక్తిప్రపత్తులతో అతనిని పొందితే, ఈ లోకంలో, పరలోకంలో మనం మనకు కావలసిన ప్రయోజనాలను పొంది, తరించవచ్చు - అనేది పురుషసూక్తంలో చెప్పబడే సారమైన అర్థం. దీని అర్థాన్ని తెలియకపోయినా, కేవలం శబ్దాన్ని మాత్రం ఉచ్చరించినప్పటికీ, దీని అర్థాన్ని తెలిసిన భగవంతుడు మనం మనస్సులో కోరిన ప్రయోజనాన్ని ఇస్తాడు. ఒక ధనికుని ఇంటి వాకిటిలోకి పోయి, “భిక్షాం దేహి'' అని ప్రార్థిస్తే , “ఆ మాట అర్థం నీకు తెలుసా?'' అని అతడు అడుగుతాడా? “వీడు భిక్షను అడుగుతున్నాడు“ అని భావించి, భిక్షను ఇస్తాడు కదా. ఆ విధంగానే ఇక్కడ కూడా భావించాలి.

భగవంతుడైన శ్రీమన్నారాయణుడు పరం, వ్యూహం, విభవం, అంతర్యామి, అర్చ అని అయిదు విధాలైన అవతారాలను గ్రహిస్తున్నాడు. ఒక్కొక్క అవతారంలోను అతడు భక్తులను రక్షిస్తాడు - అని ఈ సూక్తం వివరించింది. తైత్తిరీయోపనిషత్తులోని రెండవ ప్రశ్న పైన తెలిపిన ఐదు అవతారాలను మొదటిలోనే తెలుపడమేకాక, వీటిని చివరలోకూడా తెలిపింది. ఈ ఐదు అవతారాలనే ఈ పురుషసూక్తం రెండు అనువాకాలలో పలుకుతున్నది. 'పురుషుడు' అనే పదానికి ఏ వస్తువు లేని ప్రళయకాలంలో కూడా ఏ తత్త్వం నశించనిదై, వికారం లేనిదై జలంలో ఉన్నదో, అదే పురుషతత్వం - అని తైత్తిరీయారణ్యకం మొదటి ప్రశ్నలో చెప్పబడినందున, అది నారాయణుని గూర్చి పలికినందున, పురుషసూక్తానికి నారాయణానువాకం అనే పేరును సాయణాచార్యులు పలికినందున, శ్రియఃపతి అయిన నారాయణుడు పురుషసూక్తంలో చెప్పబడుతున్నాడు - అని తెలియాలి.

భగవానుని అయిదు విధాలైన అవతారాలను నమ్మాళ్వారులు తిరువాయ్ మొழி ప్రబంధంలో “విణ్ మీదిరుప్పాయ్ మలైమేల్ నిఱ్పాయ్ కడల్ శేర్ ప్పాయ్ మణ్ మీదుళల్ వాయ్ ఇవఱ్ఱుళ్ ఎంగుమ్ మఱైందుఱైవాయ్'' (పరమపదంలో ఉన్నావు, పర్వతంపై ఉన్నావు, సముద్రంలో చేరుతున్నావు, భూమిపై సంచరిస్తున్నావు. ఈ జీవులందరిలో మరుగునపడి

ఉన్నావు) అనే పాశురంలో అనుభవించారు. ఇందులో ఆళ్వార్లు భగవంతుని ప్రభువునువలె అనుభవిస్తున్నారు. ప్రభువు పగటివేళ సభలో సింహాసనంలో కూర్చుని మంత్రులతో కలసి, రాజ్యాంగంలోని క్షేమాన్నిగూర్చి ఆలోచిస్తాడు, అదేవిధంగా, భగవంతుడు కూడా శ్రీవైకుంఠంలో నిత్యసూరులతో కలసి భూలోకంలో ఉండేవారి క్షేమాన్ని గూర్చి చింతిస్తాడు. ప్రభువు రాజ్యంలో దుష్టశిక్షణ శిష్టరక్షణలను గూర్చి ఏకాంతంగా శయనించి, నిద్రించే వానివలె కళ్ళు మూసుకొని ఆలోచిస్తాడు. భగవంతుడు కూడా వ్యూహావతారంలో అనిరుద్ధరూపుడై శయనించి, లోకాలను ఏవిధంగా రక్షించాలి? - అని ఆలోచిస్తాడు. ప్రభువు దుష్టజంతువులను నశింపజేయడం కోసం వేటాడతాడు. భగవంతుడు కూడా దుష్టులైన రావణుడు మొదలైనవారిని వధించడం కోసం ఎన్నో అవతారాలు ఎత్తుతాడు. ప్రభువు తన రాజ్యంలో ఉండే ప్రజల అభిప్రాయాలను తెలుసుకోవడంకోసం మారువేషంలో రాత్రివేళ సంచరిస్తాడు. ఆ విధంగానే భగవంతుడు కూడా మన అభిప్రాయాలను గ్రహించడంకోసం మన మనసులలో అంతర్యామిగా ఉంటాడు. ప్రభువు వేటాడిన తరువాత తనకు ఇష్టమైనవారితో కలసి పూలతోటలలో ఆనందిస్తాడు. భగవంతుడు కూడా శ్రీరంగం, తిరుమల, కంచి మొదలయిన దివ్యదేశాలలో, ఇంకా, తాను అభిమానించిన క్షేత్రాలలో, గృహాదులలో అంతట అర్చారూపాన్ని స్వీకరించి తనకు ఇష్టమైన ఆళ్వారులు, ఆచార్యులు మొదలైనవారితో కలసి ఆనందిస్తాడు. ఈ విషయాన్ని నాయనార్ **ఆచార్యహృదయం** అనే గ్రంథంలో 15వ చూర్ణికలో తెలుపగా, దానిని శ్రీవరవరమునులు అందంగా వివరించారు.

పురుషసూక్తం మొదటి నాలుగు ఋక్కులతో పరవాసుదేవుని స్థితిని “మున్నీర్ జాలమ్ పడైత్త ఎమ్ ముకిల్ వణ్ణనే!” (మూడు విధాలైన నీటిని కలిగిన భూమిని సృష్టించిన ఓ మేఘవర్ణా!) అని నమ్మాళ్వారులు పలికిన రీతిలో దివ్యమంగళవిగ్రహంతో జగత్కారణం అవుతున్నాడు అని తెలుపుతున్నది. ప్రకృతి మండలం కంటే త్రిపాద్ విభూతి మూడురెట్లు పెద్దది. అని అంతకంటే పెద్దది బ్రహ్మమని స్పష్టంగా ఈ ఋక్కులు తెలుపుతున్నవి.

ఈ భగవంతుడు చేతనాచేతన పదార్థాలలో ప్రవేశించి ఉంటాడు. అందుచేత చిత్తు, అచిత్తు అనే రెండు భగవంతునకు శరీరాలు అనే విషయాన్ని కూడా ఈ ఋక్కులు తెలుపుతున్నవి.. భూత భవిష్యత్ వర్తమానాలనే మూడు కాలాలలో ఇతడు ఉన్నాడు. మోక్షం ఇచ్చేవాడు ఇతడే. ఇతడు జనుల హితంకోసం వారు అనుభవించే ఒక్కొక్క వస్తువులోను ఉండి, వాటిని భోగ్యంగా ఉండేటట్లు చేస్తున్నాడు - అనే విషయాన్ని కూడా ఇవి తెలుపుతున్నవి. అందువల్ల ఈ విభూతిలోని భోగ్యతను తెలిసిన ఆళ్వారులు "అచ్చువై క్కట్టి ఎన్గో! అఱుశువై అడిశిలెన్గో! నెయ్ చ్చువై త్తేఱలెన్గో! కనియెన్గో! పాలెన్గేనో!" (భోగ్యమైన గడ్డ అందునా! ఆరు రసాలను కల పదార్థమందునా! నేతితరగ అందునా! ఫలమందునా! పాలందునా!) అని అన్నారు.

అయిదవ ఋక్కునుండి 15 ఋక్కువరకు వ్యూహావతారాన్ని గురించి తెలుపబడింది. సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అనే ముగ్గురు వ్యూహమూర్తులని చెప్పబడుతున్నారు. ఈ ముగ్గురితో పరవాసుదేవుని కూడా కలిపి వ్యూహమూర్తులు నలుగురు అని చెప్పేవారు కూడా ఉన్నారు. వ్యూహం జగత్కారణమైన పరబ్రహ్మమే కనుక, అధికంగా వ్యూహమూర్తిని గూర్చి ఉపనిషత్తు కాని, రామాయణమహాభారతాలు మొదలైనవి కాని వివరంగా చెప్పడానికి ప్రయత్నించలేదు. ఆగమాలు వ్యూహమూర్తులను విస్తృతంగా తెలుపుతున్నాయి. భట్టర్ మొదలైన పూర్వాచార్యులు భగవంతుడు చేసిన మహోపకారాలనుగూర్చి చెప్పేటప్పుడు పలురీతులలో భగవంతుడు మనకు చేసిన ఉపకారాలను భావించి వ్యూహంలో అభినివేశం పొందారు. జగత్ కారణుడు నారాయణుడు. మోక్షాన్ని పొందినవారు తనను అనుభవించడంకోసం అతడు వాసుదేవుడై ఉన్నాడు. అతడే మనకు శాస్త్రాలను చేతిదీపంగా ఇవ్వడంకోసం సంకర్షణుడు అవుతున్నాడు. సృష్టిని చేయడంకోసం, ధర్మాన్ని నడపడంకోసం, ప్రద్యుమ్నుడు అవుతున్నాడు. లోకాలను రక్షించి, తత్వాన్ని ఉపదేశించడంకోసం అనిరుద్ధుడు అవుతున్నాడు. భగవంతుడు చేసిన ఉపకారాలనుగురించి తెలిసికొని, ఆ స్వామి విషయంలో అభినివేశాన్ని

కలిగి ఉండడానికి వ్యూహం తగినది. వ్యూహావతారానికి సంబంధించిన వివరం ఆగమాలలో తెలుస్తుంది. వ్యూహావతారంలోని విషయాలను మీమాంసలో చెప్పబడే లింగం మొదలైన ప్రమాణాలను ఆధారంగా చేసుకొని పురుష సూక్తలోని అయిదవ ఋక్కునుండి పదిహేనవ ఋక్కువరకు తెలియవచ్చు.

పదహారవ ఋక్కులో భగవంతుని ధ్యానం చెప్పబడుతున్నది. "తిరుక్కండేన్ పొన్ మేని కండేన్" (లక్ష్మీదేవిని దర్శించాను, బంగారు తిరుమేనిని దర్శించాను) అని, "ధ్యేయ స్సదా సవితృమండలమధ్యవర్తీ", "ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః" అని చెప్పే విధంగా భగవంతుడు సూర్యునివలె ప్రకాశిస్తూ ఉంటాడు. అతనిని ఆచార్యోపదేశం ద్వారా తెలుసుకోవాలి అని పదిహేడవ ఋక్కులో చెప్పబడుతున్నది. భగవానుని స్వరూపాన్ని బ్రహ్మ శక్రునకు చెప్పాడు. శక్రుడు లోకంలో ప్రచారం చేశాడు. భగవంతుని ఈ విధంగా తెలిసికొన్నవాడు ఈ లోకంలోనే మోక్షాన్ని పొందినవానివలె అవుతున్నాడు. ఈ భగవంతుని భక్తితో తప్ప వేరొక దారిలో పొందడానికి వీలు లేదు అని చెప్పింది.

పద్దెనిమిదవ ఋక్కులో భక్తిని ఆచరించడంలో శక్తి లేనివాడు యాగంవంటి శరణాగతిని చేయాలి - అని తెలుపుతున్నది. ఇది గొప్ప ధర్మం - అని తెలిపి, పురుష సూక్తంలోని మొదటి అనువాకం పూర్తి అవుతున్నది. ఈ శరీరంతో దర్శించడానికి సాధ్యం కాని పరరూపవ్యూహరూపాలనే అనే రెండిటిని తెలిపి, భక్తి, ప్రపత్తి మొదలైన ఉపాయాలను తెలిపి, ఆచార్యుని మూలంగా వీటిని పొందాలి - అనేదే మొదటి అనువాకంలోని అర్థం.

రెండవ అనువాకంలో క్రమంగా అర్చావతార, అంతర్యామి అవతారాలను గూర్చి తెలిపి, భగవదవతార రహస్యం తెలిసినవారు నిత్యసూరుల స్థానమైన శ్రీ వైకుంఠాన్ని చేరడానికి సమయం కోసం ఎదురు చూస్తూ ఉంటారు, భగవంతుని శ్రీదేవి, భూదేవి అనే ఇద్దరు పత్నులుగా అతనిని క్షణమైనా విడవకుండా ఉంటారు. శ్రీదేవి భూదేవుల అందం (లేక, రూపం, లేక, స్వరూపం)

కొరత లేనిది. ఈ ఇద్దరు భగవంతుని కరుణకు కారణమవుతున్నారు - అని పలికి, ఇటువంటి భగవంతుడు మనం కోరిన జ్ఞానాన్ని, ఈ లోకజీవనానికి కావలసిన సంపదను, పరలోక జీవనానికి కావలసిన మోక్షాన్ని, ఇంకా, మనకు కావలసిన అన్నింటిని ఇవ్వాలి - అని ప్రార్థించి పూర్తి అవుతున్నది.

ఈ రెండవ అనువాకంలో ఆరు ఋక్కులు ఉన్నాయి. అర్చావతారం అనేది సాలగ్రామ రూపంగా, మట్టితో, లోహాలతో చేయబడిన రూపంగా "తమరుకందదు ఎవ్వురువమ్ అవ్వురువమ్ తానే", "యే యథా మాం ప్రపద్యంతే" అని చెప్పిన విధంగా అర్చారూపంలో ఉంటాడు. విగ్రహాన్ని నిర్మించేవాడు భగవంతుని స్వరూపసారూప్యమోక్షాన్ని పొందుతున్నాడు - అని మొదటి ఋక్కు అంటున్నది. రెండవ ఋక్కు ఈ అర్చావతారరంలో భక్తిప్రపత్తులు చేసేవారు పొందుతున్న మోక్షాన్ని పొందడానికి ఇంకొక దారి లేదు - అని తెలుపుతున్నది. "అర్చావతారమనేది 'తమరుకందదు ఎవ్వురువమ్ అవ్వురువమ్ తానే' అనే విధంగా భక్తులకు ఇష్టమైన ద్రవ్యాలలో చేయబడిన రూపం. విభవవిశేషాలవలె కాకుండా, దేశకాల అధికారి నియమంలేని విధంగా వేంచేసి ఉండి, ఏ అపరాధాలను చూడకుండా అర్చక పరతంత్రంగా సమస్తవ్యాపారాలను కలవాడై, ఆలయాలలో, గృహాలలో వేంచేసి ఉండే స్థితి ఇది. రుచిని కలిగించడం, దివ్యమంగళ విగ్రహాన్ని కలిగి ఉండడం, సమస్త లోకాలకు శరణమై ఉండడం, అనుభవించదగినదై ఉండడం - అనే ఇవీ అన్నీ అర్చాతారంలోనే పరిపూర్ణం. సర్వస్వామిభావాన్ని మార్చుకొని, అజ్ఞునివలె, స్వాతంత్ర్యం లేనివానివలె ఉన్నప్పటికి, గొప్ప కరుణతో పరవశుడై, అన్ని అపేక్షితాలను ఇస్తాడు" - అనే శ్రీపిళ్ళైలోకాచార్యులవారి సూక్తి ఇక్కడ అనుసంధేయం.

మూడవ ఋక్కులో అంతర్యామి దశ చెప్పబడుతున్నది. "అంతః ప్రవిశ్య" అనేవిధంగా అందరికీ అంతర్యామిగా ఉండడం. సర్వాంతర్యామిత్వమంటే నరకంలో ఉండడం మొదలైన అన్ని దశలలో

చేతనులకు సహాయంగా ఉండి, వారిని విడవకుండా ఉండే స్థితికి మించి దివ్యమంగళవిగ్రహం కలవాడై, వారికి ధ్యానించడానికి తగినవాడై ఉండడంకోసం, బంధుభూతుడై, హృదయ కమలంలో వేంచేసిఉండే సన్నివేశం - అని శ్రీపిళ్ళైలోకాచార్యులవారు పలికిన అంతర్యామి అవతారప్రయోజనాన్ని అందంగా ఇక్కడ అనుభవించాలి. తరువాత, విభవావతారాన్ని, విభవావతార ప్రయోజనాన్ని చింతించడం చాలా ఆవశ్యకం.

అవతారాల వివరాన్ని శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించిన **తత్వత్రయంలోని ఈశ్వరప్రకరణంలో** పలికిన సూక్తులను, వాటికి శ్రీవరవరమునులు చేసిన వ్యాఖ్యానాన్ని అనుసంధించి అనుభవించవచ్చు. అవతార రహస్యాన్ని గీతాచార్యుడు " బహూని మే వ్యతీతాని'' అని ఆరంభించి గీతలో నాలుగవ అధ్యాయంలో ఐదు శ్లోకాలతో తెలియజేశాడు. అవతారాలు సత్యమని, అవతారంలో భగవంతుని జ్ఞానానికి ఏమాత్రం కొరత ఉండదని, అవతార రూపాలు శుద్ధసత్వమయాలని, అవతారానికి కారణం భగవంతుని సంకల్పమే అని, అవతారానికి కాలం ధర్మాన్ని రక్షించవలసిన కాలమే అని, భగవానుని క్షణంకూడా విడువకుండా ఉండాలి అని భావించే భక్తులను రక్షించడమే అవతారానికి ప్రయోజనం అని, ఇదే అవతారరహస్యమని, ఈ రహస్యాన్ని నిరంతరం అనుసంధించేవానికి మరుజన్మ లేదని ఆచార్యులు పురుషసూక్తంలో ఉండే అర్థాన్ని తెలిసికొని తెలియజేశారు - అనేది ఇక్కడ మనం మనసులో గ్రహించాలి

నాలుగవ ఋక్కు, భగవంతుడు దేవతలకోసం ప్రకాశిస్తున్నాడు దేవతలకు హితబుద్ధిని ఇస్తున్నాడు, ఇతడే అందరికీ మూలకందం, ఇతనికి నమస్కరిస్తున్నాను - అని తెలుపుతున్నది. ఐదవ ఋక్కు - దేవతలకు అందరికి ఇతడే ఈశ్వరుడు. ఇతడే వారికికూడా బ్రహ్మజ్ఞానాన్ని ఇచ్చేవాడు. ఇతడే అని, ఎవడు భగవంతుని తెలిసికొంటున్నాడో, అతనికి దేవతలు వశం అవుతారు - అని తెలుపుతున్నది. ఆరవ ఋక్కు, శ్రీదేవి, భూదేవి సమేతుడైన

భగవంతుడు మన పక్కనే ఉండి, రాత్రి పగలు అనుగ్రహిస్తూ, ఇహలోక పరలోకాలలో కావలసిన జ్ఞానాన్ని, సంపదను, ఇంకా మనకు కావలసినవానిని అన్నిటినీ ఇవ్వాలి - అని తెలుపుతున్నది.



శ్రీమతే రామానుజాయ నమః

# పురుషసూక్తమ్ - సవ్యాఖ్యానమ్

వ్యాఖ్యాతం పౌరుషం సూక్తం కృష్ణస్వామివిపశ్చితా ।
ద్రావిడీం వాచమాశ్రిత్య సవిశేషం మనోహరమ్ ॥

గిరాంధ్రా లిఖ్యతే సైషా వివృతిః విబుధాజ్ఞయా ।
శింగరార్యేణ దాసేన విద్వజ్జనముదే మయా ॥

**అవతారిక:** పురుషసూక్తం సుప్రసిద్ధమైనది. **“వేదాన్తవిழுప్పొరుళిన్ మేలిరున్ద విళక్కు”** (వేదాంతాలలోని గొప్ప అర్థాలలో గొప్పగా ప్రకాశించే దీపం) అయిన శ్రీమన్నారాయణుని అందటికి చక్కగా నిర్ణయించి తెలిపేది ఇదే. దీని వైభవం వాచామగోచరం. ఇది పురుషోత్తముడైన నారాయణునే వర్ణిస్తున్నదని సకలస్మృతీతిహాసపురాణాలలో చెప్పబడింది. **“యోనూచానద్విజం గత్వా హతవానర్థ లోభతః, స పఠేత్ పౌరుషం సూక్తం జలస్థః చింతయన్ హరిమ్”** (ఎవడు, సాంగవేదాధ్యయనాన్ని చేసిన బ్రాహ్మణుని చేరి, ధనకాంక్షతో అతనిని వధిస్తాడో, అతడు నీటిలో నిలచి ఉండి, హరిని ధ్యానిస్తూ పురుషసూక్తాన్ని పఠించాలి) అని, **“జప్త్వాథ పౌరుషం సూక్త ముచ్యతే గురుతల్పగః”** (గురుపత్నితో సంగమించినవాడు కూడా పశ్చాత్తాపపడి పురుషసూక్తాన్ని జపించి ఆ మహాపాపం నుండి విముక్తుడవుతున్నాడు) అని, **“బ్రహ్మయజ్ఞే ద్విజః సూక్తం పౌరుషం చింతయన్ హరిమ్, స సర్వాన్ జపతే వేదాన్ సాంగోపాంగాన్ ద్విజోత్తమః”** (ప్రతిదినం నిర్వహించవలసిన పంచమహాయజ్ఞాలలో ఒకటి అయిన బ్రహ్మయజ్ఞంలో హరిని ధ్యానిస్తూ పురుషసూక్తాన్ని జపించే బ్రాహ్మణుడు సాంగోపాంగాలైన వేదాలను అన్నిటిని జపించిన వాడవుతున్నాడు) అని పెద్దలు దీని మహిమనుగూర్చి పలికారు. శౌనక భగవాన్ కూడా పురుషసూక్తంలోని

ఋక్కులతో శ్రీమన్నారాయణుని ఆరాధనం చేయాలని ఉపదేశించి, **"అర్చితం స్యాత్ జగదిదమ్"** అని దానివల్ల సకలలోకాలను ఆరాధించినట్లవుతుందని వ్యక్తం చేశారు. ఇంతేకాక, పురుషసూక్తంలోని ఋక్కులతో ఘృతంతో అగ్నిలో హోమం చేసేవాడు సంసారానికి కారణమైన పాపాలను తీర్చుకొని, మోక్షాన్ని పొందుతాడని, జగత్కారణుడు, దివ్యమంగళవిగ్రహాన్ని కలవాడు, సకల కల్యాణగుణపూర్ణుడై, దేవాధిదేవుడైన శ్రీమన్నారాయణుని పురుషసూక్తంతో ధ్యానించేవాడు మోక్షాన్ని పొంది, **"సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా"** (ముక్తిని పొందినవాడు సర్వజ్ఞుడైన పరమాత్మతో కూడా అతని సకలకల్యాణగుణాలను అనుభవిస్తాడు) అనే రీతిలో బ్రహ్మానందాన్ని పొందుతాడని దీని మహిమ విస్తృతంగా వ్యక్తం చేయబడింది. ఇంకా పలువురు ఋషులు దీని మహిమను విస్తృతంగా పల్కినప్పటికీ, విస్తృతిభయంవల్ల ఏతావన్మాత్రంతో విడువబడింది.

పురుషసూక్తం యొక్క అర్థం **'ముద్గలోపనిషత్తు'**లోను, దానిలో ప్రస్తావింపబడిన **'పురుషసంహిత'**లోను చక్కగా వ్యక్తం చేయబడింది. ఈ ఉపనిషత్ ఋగ్వేదాంతర్గతంగా స్మార్తులచే ప్రకాశింపజేయబడింది. ఇది మన పూర్వాచార్యులచే ప్రమాణంగా గ్రహింపబడినట్లు కనపడలేదు. అయినా, హరిదాసర్‌చే ప్రకాశింపజేయబడిన **"ఇరు శమయ విళక్కమ్"** అనే గ్రంథంలో ఉట్టంకింపబడినందున, పురుషసూక్తంలోని అర్థాన్ని నిర్ణయించేటపుడు అది అక్కడక్కడ ప్రస్తావింపబడుతుంది. ఈ పురుషసూక్తం పరమాత్మ అయిన వాసుదేవునిచే ఇంద్రునకు ఉపదేశింపబడినదని ముద్గలోపనిషత్తులోని రెండవ ఖండంలో కన్పిస్తున్నది. పురుషసూక్తానికి విద్యారణ్యులు, మాధవాచార్యులు కూడా భాష్యాన్ని రచించారు.

శ్రీవిష్ణుపురాణంలో ధ్రువుడు పరమాత్మను స్తుతించే ప్రకరణంలో పురుషసూక్తమంత్రాలను అనుసరించి స్తోత్రం చేసినట్లు కన్పిస్తున్నది. ఇక్కడ, సకల శాస్త్రపారంగతులు, **"ఎజ్గళాழ్వాన్"** అని కీర్తింపబడేవారైన

శ్రీవిష్ణుచిత్తాచార్యులవారు విశేషంగా వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. దానిని అనుసరించి ఇక్కడ పురుషసూక్తం వ్యాఖ్యానింపబడుతున్నది.



1. **సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ ।**
**స భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠద్దశాంగులమ్ ॥**

(పురుషుడని చెప్పబడే నారాయణుడు అనంతమైన శిరస్సులను, లెక్కించ లేని కన్నులను, పలు పాదాలను కలవాడు. అతడు భూమిని నాల్గు పాదాలతో వ్యాపించి, అనంతయోజనాల ప్రమాణమైన బ్రహ్మాండాన్ని ఆక్రమించాడు)

**"సహస్రశీర్షా ఇత్యత్ర సహస్రోనంతవాచకః, అనంతయోజనం ప్రాహ దశాంగులవశ స్తథా, తస్య ప్రథమయా విష్ణోః దేశతో వ్యాప్తి రుచ్యతే"** (**"సహస్రశీర్షా"** - అనే ప్రయోగంలోని 'సహస్ర' శబ్దం అనంతమనే అర్థాన్ని తెల్పుతున్నది. 'దశాంగుల'మనే పదం అనంతయోజనాలను తెల్పుతున్నది. పురుషసూక్తంలోని మొదటి మంత్రంతో విష్ణువుయొక్క సర్వతో వ్యాప్తి చెప్పబడుతున్నది) అని పురుషసంహితలో ఈ మొదటి మంత్రంలోని అర్థం చెప్పబడింది.

**(సహస్రశీర్షా)** - లెక్కలేనన్ని శిరస్సులను కలవాడు - అని అర్థం. ఇక్కడ శీర్షశబ్దం అన్ని అంగాలను ఉపలక్షిస్తుంది. త్వక్కు, జిహ్వ, కన్నులు, ముక్కు, చెవులు - అనే జ్ఞానేంద్రియాలు అయిదు కల్గి ఉన్నందున శిరస్సు ముందుగా ప్రస్తావింపబడింది. ఇక్కడ 'శీర్ష' శబ్దం జ్ఞానేంద్రియాలద్వారా కలిగే జ్ఞానాన్ని సూచిస్తుంది. బ్రాహ్మణంలో **"బోధనమననశ్రవణ స్పర్శన దర్శనరసనఘ్రాణజ్ఞానాని శ్రుతాని భవంతీతి శిరః"** (తెలిసికోవడం, మననం చేయడం, వినడం, తాకడం, చూడడం, రుచి చూడడం, వాసన చూడడం - అనే జ్ఞానాలు దీనివల్ల తెలియబడుతున్నాయి కనుక ఇది "శిరః" అని

అనబడుతున్నది) అని శిరశ్శబ్దంయొక్క అర్థం చెప్పబడింది కదా! దీనివల్ల అనంతుడు అపరిమితమైన జ్ఞానాన్ని కలవాడు - అనే అర్థం తెలుపబడినట్లయినది.

**(సహస్రాక్షః)** - దీనినే **"సహస్రాక్షః"** అని వేదం వివరించింది. **"సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్"** (ఇంద్రియాలన్నిటిలో కన్ను ప్రధానం) అని అన్నందున నయనం ప్రస్తావింపబడింది. ఇక్కడ 'అక్ష' శబ్దం అయిదు జ్ఞానేంద్రియాలను తెల్పుతూ, పురుషోత్తముడు అనంతమైన జ్ఞానాన్ని కలవాడని తెలియజేస్తున్నది.

**(సహస్రపాద్)** - లెక్క లేనన్ని పాదాలను కలవాడు. ఇక్కడ **"పాద్"** అనే పదం అయిదు కర్మేంద్రియాలను తెలుపడంద్వారా అంతు లేని శక్తిని కలవాడు, అచ్యుతుడనే అర్థాన్ని తెలియజేస్తున్నది. **"సహస్రాక్షః సహస్రపాద్"** అనే ఈ రెండు పదాలద్వారా భగవానుడు అంతు లేని జ్ఞానశక్తులను కలవాడు - అని తెలుపబడింది. **"పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ"** (సర్వేశ్వరుని శక్తి, జ్ఞానం, బలం, క్రియలు స్వాభావికమైనవిగా, పలు రీతులను కల్గినవిగా, గొప్పవిగా వినబడుతున్నాయి) అని కదా ఉపనిషత్ ఘోషిస్తున్నది.

**(సహస్రశీర్షా)** - దీనికి వేఱు రీతిలో కూడా అర్థాన్ని గ్రహించవచ్చు. సకలప్రాణులు అంతర్భవించిన బ్రహ్మాండం నారాయణునకు శరీరమైనందున, దీనిలో అణగి ఉండే ప్రాణుల శిరస్సులు, కాళ్ళు, కళ్ళు మొదలైనవి అన్నీ ఇతనివే - అని అనడంలో అడ్డు లేదు. ఇక్కడ విద్యారణ్య భాష్యంలోకూడా - సర్వప్రాణులు ఇతని శరీరంలో అణగి ఉన్నందున, ఆ అవయవాలన్నీ ఇతని అవయవాలే అవుతాయి - అని వివరింపబడింది. సకలప్రాణుల అవయవాలు తనకు శేషంగా కలవాడని చెప్పబడుతున్నది. అందువల్లనే అతడు హృషీకేశుడు (ఇంద్రియాలను నియమించేవాడు) అనబడుతున్నాడు. శిరస్సుచే నమస్కరింపబడదగినవాడితడే; జిహ్వాతో స్తుతింపదగినవాడితడే; బుద్ధిచే

తెలియదగినవాడు హరియే. నేత్రాలచే దర్శింపదగినవాడితడే చెవులతో వినదగినవాడితడే - ఇతని కీర్తియే.

**(సహస్రపాద్)** - అని మన కర్మేంద్రియాలు అతని కైంకర్యాలను చేయడానికి ఏర్పడ్డాయి - అని తెలుపబడుతున్నది. ఈ సందర్భంలో **"వాయవనై యల్లదు వాழ்త్తాదు కై ఉలకమ్ తాయవనై యల్లదు తామ్ తొழா, పేయ్ములై నఞ్జు ఊణాక ఉణ్డాన్ ఉరు వొడు పేరల్లాల్ కాణా కణ్ కేళా శెవి"** (జిహ్వ ఆ భగవానుని తప్ప ఇంకొకరిని స్తుతించదు. చేతులు లోకాలను స్పృశించినవానిని తప్ప ఇంకొకరిని నమస్కరించదు. పిశాచి అయిన పూతన స్థన్యాన్ని ఆహారంగా భుజించినవాని రూపంతోపాటు పేరును తప్ప, వేఱొక రూపాన్ని చూడదు, నాచెవి వేఱొక నామాన్ని వినదు) అనే పాశురం అనుసంధేయం.

"సహస్రశీర్షా" - ఇత్యాది పదాలు అర్జునునకు విశ్వరూప దర్శనసమయంలో చూపింపబడిన రీతిలో అసాధారణమైన విగ్రహాన్ని వర్ణిస్తున్నవి - అని కూడా చెప్పవచ్చు. ఆழ்వార్లు కూడా దీనినే **"తోళ్‌కళ్ ఆయిరత్తాయ్! .... తాళ్‌కళాయిరత్తాయ్"** (వేయి బాహువులను కలవాడా! వేయి శిరస్సులను కలవాడా! వికసించే పూలవంటి వేయి నేత్రాలను కలవాడా! వేయి పాదాలను కలవాడా!) అని వర్ణించారు కదా!

**(పురుషః)** - ఇందులో చెప్పబడే పురుషుడెవడు? ఇది ఏ దైవాన్ని అయినా నిర్దేశించవచ్చుకదా! - **"పురుషః"** అనేది సామాన్యశబ్దమే కదా! - అని కొందఱు ప్రశ్నించవచ్చు. **"భగవానితి శబ్దోయం తథా పురుష ఇత్యపి, నిరుపాధీ చ వర్తేతే వాసుదేవే సనాతనే, స ఏవ వాసుదేవోసౌ సాక్షాత్పురుష ఉచ్యతే, స్త్రీప్రాయ మితరత్ సర్వం జగద్బ్రహ్మపురస్సరమ్"** (భగవచ్ఛబ్దం, పురుషశబ్దం - అనే ఈ రెండు శబ్దాలు సహజంగానే సనాతనుడైన వాసుదేవుని నిర్దేశిస్తున్నాయి. ఆ వాసుదేవుడే సాక్షాత్ పురుషుడని చెప్పబడుతున్నాడు. బ్రహ్మ మొదలుగా గల మిగిలిన ప్రాణులంతా స్త్రీప్రాయులే) అని పాద్మపురాణంలో చెప్పబడింది. "భగవంతుడు, పురుషుడు" - అనే రెండు పదాలు ముఖ్యంగా నారాయణునే

నిర్దేశిస్తాయి. అతడొక్కడే పురుషుడు. ఇతరులు స్త్రీప్రాయులే. స్త్రీ పురుషుని విడిస్తే ఆమె జారిణి అనబడేటట్లే, అన్యదైవవాలను కొలిచే జీవులు కూడా ఆ విధంగా అనబడుతున్నారు. పురుషుడంటే సకలచేతనాచేతనాలలోను వ్యాపించి, నిండి ఉండేవాడని భావం. ఇది నారాయణునకే అసాధారణమైన గుణం. సుబాలోపనిషత్తులో **"సహస్రశీర్షా"** అనే మంత్రాన్ని పరమపురుషుని ఉద్దేశించి ప్రయోగించి, అతడే సర్వభూతాంతరాత్మ అయిన నారాయణుడు - అని నిర్ణయించినందువల్ల ఈ పురుషశబ్దం నారాయణునే నిర్దేశిస్తుంది - అనేది సర్వవేదాంత ప్రత్యయన్యాయాను సారంగా సిద్ధిస్తున్నది. గీతాచార్యుడు కూడా **"యస్మాత్ క్షరమతీతోహ మక్షరాదపి చోత్తమ, తస్మాద్వేదే చ లోకే చ ప్రథితః పురుషోత్తమః"** (జ్ఞానంలో హెచ్చు తగ్గులుండే సంసారి పురుషుని అతిక్రమించినవాడనై, జ్ఞానంలో సంకోచవికాసాలను లేని ముక్తునికంటే గొప్పవాడనై నేను ఉన్నందున లోకంలో, వేదంలో కూడా పురుషోత్తముడనే ప్రసిద్ధిని పొందాను) - అని గీతలో పలికాడు.

**(సః)** - ఈ విధంగా ప్రసిద్ధిని పొందినవాడైన ఆ నారాయణుడు,

**(భూమిమ్)- "భూమిర్భూమ్నా"** అని భూసూక్తంలో చెప్పబడినట్లు విస్తృతిని, వైశాల్యాన్ని కల్గి ఉన్నందున భూమి - అని అనబడుతున్నది. ఇక్కడ భూమి అని అన్నందున పదునాల్గు భువనాలు చెప్పబడ్డాయి.

**(విశ్వతో వృత్వా)** - ఇటువంటి, క్రింద ఏడు, పైన ఏడు - పదునాల్గు లోకాలను నాలగువైపులా వ్యాపించి - అని అర్థం. ఆ పురుషుని అంగుళాలలో పది అంగుళాల ప్రమాణాన్ని కల బ్రహ్మాండాన్ని ఆక్రమించాడు. ఈ బ్రహ్మాండం అతని స్వరూపంలో ఎక్కడో ఒక మూలలో అణగిపోయింది - అని దీని భావం.

**"దశాంగుళమ్"** - అనే దానికి విష్ణుచిత్తాచార్యులవారు **"దశగుణమ్"** అనే అర్థాన్ని పల్కి, మహాప్రమాణాన్ని కల ఈ అండం- అని వ్యాఖ్యానించారు. పురుషసంహితలో కూడా ఈ అర్థమే ఆదరింపబడింది. మాధవాచార్యులవారు

బ్రహ్మ మొదలైన జీవుల పది అంగుళాల పరిమితిని కల హృదయకమలంలో అంతర్యామిగా ఉన్నాడనే అర్థాన్ని చెప్పారు. నాభికి పైన పది అంగుళాలకు పైన ఉండే హృదయంలో నివసిస్తున్నాడు - అని అన్నారు మహీధరులు. విద్యారణ్యులయితే, "దశ" అనే దానికి అనేకం - అనే అర్థాన్ని గ్రహించి, బ్రహ్మాండానికి బయటకూడా వ్యాపించి ఉన్నాడు - అనే అర్థాన్ని చెప్పారు.

**"యోయ ముక్తః పురుషః నామరూపజ్ఞానగోచరం సంసారిణా మతిదుర్జ్ఞేయం విషయం విహాయ క్లేశాదిభిః సంక్లిష్టదేవాదిసంజిహీర్షయా సహస్రకలావయవకల్యాణదృష్టమంతరేణ మోక్షదం వేషమ్ ఆదదే. తేన వేషేణ భూమ్యాదిలోకం వ్యాప్య అనంతయోజనమ్ అధ్యతిష్ఠత్"** (ఇక్కడ చెప్పబడిన పురుషుడు నామరూపాలను తెలిసే జ్ఞానానికి అందనిది, సంసారులకు మిక్కిలి దుర్జ్ఞేయమైనది అయిన భగవత్ స్వరూపాన్ని విడచి, క్లేశాదులతో బాధపడే దేవమనుష్యాదులను కాపాడడం కోసం సహస్రకళలను కల అవయవాలతో అందంగా ఉండేది, చూడగానే మోక్షాన్ని ఇచ్చేది అయిన వేషాన్ని పరిగ్రహించాడు. ఆ వేషంతో భూమ్యాదిలోకాలను వ్యాపించి, అనంతయోజనాలను కల అండాన్ని ఆక్రమించాడు) - అని ఈ మొదటి ఋక్కుయొక్క అర్థం ముద్గలోపనిషత్తులో అందంగా వ్యక్తం చేయబడింది.

ఇందువల్ల పరమపురుషునకు దేశపరిచ్ఛేదం (దేశంవల్ల పరిమితిని కల్గి ఉండడం) అనేది లేదని తెలుపబడింది. అక్కడ, ఇక్కడ, అంతటా పరమపురుషుడు వ్యాపించి ఉన్నాడు. ఇక్కడ సర్వవ్యాపకత్వాన్ని పురస్కరించుకొని ఇతడు విష్ణువే అని చూపబడింది. **"విశతీతి విష్ణుః"** అని అంతటా ప్రవేశించి ఉన్నందున విష్ణువు - అని, భగవంతుడు జ్ఞానం, శక్తి మొదలైన కల్యాణగుణాలను కలవాడని, సకలలోకాలను వ్యాపించి, వానిని శరీరంగా కల్గి ఉన్నాడని, అసాధారణమైన అప్రాకృత శరీరాన్ని కలవాడని స్ఫుటంగా చెప్పబడినందున **"జగత్తు అసత్యం"** అని, **"గుణం లేదు, రూపం లేదు"** - అని పలికే అద్వైతవాదం పూర్తిగా నిరసింపబడినట్లయినది.

2. పురుష ఏవేదం సర్వం యద్భూతం యచ్చ భవ్యమ్ ।
ఉతామృతత్వస్యేశానః యదన్నేనాతిరోహతి ॥

ఏ జగత్తు పూర్వకల్పంలో ఉన్నదో, ఏ జగత్తు రాబోయే కల్పంలో ఉండబోతుందో, (సృష్టింపబడబోతున్నదో), ఏది ఈ కల్పంలో ఉన్నదో, ఏ జగత్తు అన్నంతో నశించకుండా ఉన్నదో, ఆ సమస్తమైన జగత్తు పురుషుడైన నారాయణుడే. ఇంతేకాక, మోక్షానికి ప్రభువు కూడా శ్రీమన్నారాయణుడే.

**"ద్వితీయయా చాస్య విష్ణోః కాలతో వ్యాప్తి రుచ్యతే"**, (ఈ రెండవ ఋక్కుద్వారా ఈ విష్ణువుయొక్క సర్వకాలాలలోని వ్యాప్తి చెప్పబడుతున్నది) అని ఈ ఋక్కుయొక్క అర్థం పురుషసంహితలో సంగ్రహింపబడింది.

**(పురుష...) "పోకిన్ఱ కాలఙ్గళ్ పోయ కాలఙ్గళ్ పోకు కాలఙ్గళ్"** (గడచిన కాలాలు, రాబోయే కాలాలు, గడిచే కాలాలు) అనబడే మూడు కాలాలలోను ఉండే వస్తువులన్నీ పురుషుడే - అని ఇక్కడ చెప్పబడుతున్నది. "పూర్వమంత్రంలో పరమపురుషుడు అంతటా వ్యాపించి ఉన్నాడు - అని చెప్పబడింది. ఆకాశంవలె వ్యాపించి ఉండడం మాత్రం కాదు. అన్నిటిని శరీరంగా పరమాత్మ కల్గి ఉన్నాడు - అనే దానిని ఇది తెల్పుతున్నది'' - అని విష్ణుచిత్తాచార్యులవారు వ్యాఖ్యానించారు. **"ఇదం సర్వమ్"** అని అన్నందున పురుషోత్తమునకు వస్తుపరిచ్ఛేదం లేదని చెప్పబడింది. అతడు లేని వస్తువే లేదు కదా! **"యద్భూతం భవ్యమ్"** అని అన్నందున కాలపరిచ్ఛేదం లేనివాడు కేశవుడు-అని తెలుపబడింది. ఆదిమధ్యాంతరహితుడు కదా, అనంతుడు. "పూర్వకాలంలో ఉన్నాడు; ఇపుడు లేడు - మొదలైన కొఱతలు అతని విషయంలో చెప్పడం వీలు కాదు. **"పురుష ఏవేదమ్"** అని అన్నందున **"సర్వం విష్ణుమయం జగత్"** అని తెలుపబడింది. అందుచేత మిగిలినవి లేవు - అని అర్థం కాదు. మిగిలినవి అన్నీ అతనికి శరీరమని, వాటికి అతడు అంతర్యామి - అని మాత్రమే ఏర్పడుతుంది. శరీరానికి నామాలైన కృష్ణశ్రీనివాసాదులు ఆత్మను కూడా నిర్దేశిస్తున్నాయి. ఆ విధంగానే ఈ లోకాన్ని అంతటిని శరీరంగా

కల పురుషుని "అన్నీ అతడే" అని అనడం పొసగుతుంది. "ఈ కుండ నలుపు" అని అంటే, "కుండ" అని చెప్పబడే వస్తువు, "నలుపు" అని చెప్పబడే వస్తువు రెండు ఒకటి అవుతాయా? నలుపు అనే దానిని కల వస్తువు నుండి వేఱుచేసి చూడడానికి సాధ్యం కానట్లుగా ఆ కుండలో ఉన్నది - అని మాత్రమే ఏర్పడుతుంది. ఆ విధంగానే, "పురుషుడే ఈ జగత్తు", "విశ్వమేవేదం పురుషః" అని అంటే ఈ లోకం పరమాత్మనుండి విడదీసి చూడడానికి సాధ్యం కాని రీతిలో అతనితో చేరి ఉన్నది - అనే అర్థమే ఏర్పడుతుంది. ఈవిషయాన్ని **"అన్యచ్చ రాజన్! స పరః తథాన్యః పంచవింశకః, తత్‌స్థత్వాదనుపశ్యంతి హ్యేక ఏవేతి సాధవః"** (రాజా! పరమాత్మ ఈ జగత్తు కంటే భిన్నుడు. ఇరవై అయిదవ తత్త్వమైన జీవుడు కూడా భిన్నుడు. అతనితో అంతర్యామిగా ఉన్నందున సాధువులు ఒకడే - అని భావిస్తున్నారు) అని వ్యాసుడు మోక్షధర్మంలో పలికాడు. గీతలో అర్జునుడు కూడా **"సర్వం సమాప్నోషి తతోసి సర్వః"** (నీవు అన్నిటిలోను వ్యాపించి నిండి ఉన్నందున సమస్తమై ఉన్నావు) అని శ్రీకృష్ణుని స్తుతించాడు. ఇక్కడ పురుషోత్తముడు అంతటా వ్యాపించి ఉన్నాడు- అని పలికిన తరువాత కదా **"పురుష ఏవేదం సర్వమ్"** అని చెప్పబడింది. ఆ*ళ్వా*ర్లు కూడా **"అవనే మ*ఱ్ఱె*ల్లామమ్ అఱివ్దనమే"** (అతడే మిగిలినది అంతా అని తెలిసికొన్నాము) అని, **"వరుమ్ కాలమ్ నిక*ళ్* కాలమ్ క*ళి*కాలమాయ్ ఉలకై ఒరుజ్గాక అళిప్పాయ్"** (రాబోయే కాలం, గడిచే కాలం, గడచిన కాలమై లోకాలను చక్కగా పాలిస్తావు) అని గానం చేశారు.

**(యదన్నేన అతిరోహతి)** - ఏ జగత్తు అన్నంతో నశించకుండా ఉన్నదో - అని దీని అర్థం. లోకానికి ఆహారాన్ని ఇచ్చేవాడు, వానిని నశించకుండా రక్షించేవాడు కదా, భగవానుడు. **"కాక్కుమ్ ఇయల్వినన్ కణ్ణపెరుమాన్"** (శ్రీకృష్ణుడు రక్షించే స్వభావాన్ని కలవాడు) కదా. ఇక్కడ అన్నం అనేది ఇంద్రియాలతో అనుభవింపబడే విషయాలను సూచిస్తుంది. ధర్మార్థకామాలనే ఇహలోకపురుషార్థాలను ఇచ్చేవాడు, భగవానుడే అని దీనిద్వారా తెలుపబడుతున్నది.

**(ఉతామృతత్వస్యేశానః)** - మోక్షపురుషార్థాన్ని ఇచ్చేవాడు కూడా భగవానుడే - అని దీనివల్ల చెప్పబడుతున్నది. ఇది భగవంతుని అసాధారణలక్షణం. ఇతరపురుషార్థాలను ఇవ్వడానికి పలువురు దేవతలను సృష్టించి నారాయణుడు నిలిపాడు. అయితే, మోక్షాన్ని కూడా ఇచ్చేవాడు ముకుందుడే. **"అమృతత్వమశ్నుతే"** అని వేదాలలో ఘోషింపబడిన మోక్షానికి ప్రభువు నారాయణుడే.

విద్యారణ్యులు "మూడు కాలాలలో ఉండే జగత్తు అంతా విరాట్ పురుషుడే. అన్ని కాలాలలోని సకలప్రాణుల దేహాలు కూడా విరాట్పురుషుని అవయవాలే. బ్రహ్మ, ఇంద్రుడు మొదలైనవారుకూడా ఆ విరాట్ పురుషుని ఆశ్రయించే తమ తమ స్థానాలను పొందుతున్నారు'' అనే అర్థాన్ని తెలిపారు. ఇంతేకాక, బంగారుకడ్డీ కుండలాది రూపంలోని ఆభరణాలుగా పరిణమించినా, ఆ కుండలాదులు నిర్మింపబడడానికి ముందు, నశించిన తరువాత కనబడనందున అవి వాస్తవం కాదు. బంగారం ఎల్లప్పుడు కన్పిస్తున్నందున దానిని వాస్తవమని చూస్తున్నాము. అదేవిధంగా, ఈ లోకం కూడా పూర్వం లేనిదై, ఇపుడు వ్యక్తమై, కొన్ని దినాలకు తరువాత నశించి పోతుంది కనుక వాస్తవం కాదు. విరాట్పురుషుని స్వరూపమే ఎల్లప్పుడు ఉన్నందున వాస్తవమైనది. ఆ పురుషుడే జీవాత్మల పుణ్యాపాపాలకు తగినట్లుగా వారికి ఇవ్వడం కోసం తన నిజస్వరూపాన్ని వీడి ఈ జగత్తుగా అవుతున్నాడు'' అని కూడా అన్నారు.

ఇది సరి కాదు. పుట్టడానికి ముందు, నశించిన తరువాత కన్పించనందున లోకం పరిణామాన్ని కల్గినది-అని, అనిత్యమైనది-అని ఏర్పడిందే తప్ప, మిథ్య-అని మాత్రం ఏర్పడదు. ఈ ఋక్కు **"ఇదమ్"** అని చేతనాచేతనాలతో కూడిన జగత్తును నిర్దేశిస్తున్నది. పురుషశబ్దం చేత పరమాత్మ చెప్పబడుతున్నాడు. జగత్తు వాస్తవం కాని వస్తువే అయితే, అవాస్తవమైన వస్తువును పురుషుడని పల్కడం అర్థరహితవచనమే కాగలదు. **"ఇదమ్"** అని, **"పురుషః"** అని వేఱువేఱుగా నిర్దేశింపబడినవి రెండు సత్యమైనవి - అనే

ఏర్పడుతుంది. ''యద్భూతమ్...'' ఇత్యాదిగా మూడు కాలాలు నిర్దేశింపబడినందున కాలతత్త్వం కూడా సత్యమైనదని తెలుపబడింది. అమృతత్వమని, దానికి ఈశానుడని ఇక్కడ రెండు చెప్పబడుతున్నాయి. **"అమృతత్వమ్" (మోక్షమ్)** - అనేది ఒకటి ఉంటే, దానిని పొందే వస్తువు కూడా తప్పక ఉండాలి. జగత్తు అసత్యమైతే, "అది అన్నంతో నాశం పొందకుండా ఉన్నది.'' అనే మాట (**"యదన్నేనాతిరోహతి"** అనే మాట) అసంభావితమే కాగలదు. అందువల్ల ఇక్కడ అద్వైతవాదానికి అణువంత అవకాశం కూడా లేదు. (ఇంతటితో అద్వైతమహారణ్యమైన విద్యారణ్యుని వాదాల ఖండనాలను నిలిపి వేయబడుతున్నవి.)

ఈ మంత్రంయొక్క అర్థం **"పురుషో నారాయణః భూతం భవ్యం భవిష్యచ్చ ఆసీత్, స ఏష సర్వేషాం మోక్షదశ్చ ఆసీత్"** (పురుషుడనే నారాయణుడు గడచినవిగా, రాబోతున్నవిగా, ఇపుడుండేవిగా ఉన్నాడు. అతడు అందఱికి మోక్షాన్ని ఇచ్చేవాడు) అని ముద్గలోపనిషత్తులో చెప్పబడింది.

3. **ఏతావాన్ అస్య మహిమా అతో జాయాంశ్చ పూరుషః ।**
**పాదోస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి ॥**

(పురుషుని మహిమ ఇంతటిది. ఇందువల్ల పురుషోత్తముడు గొప్పవాడు. అన్ని భూతాలు ఇతని ఒక భాగం. భోగ్యమై ఉండే మూడు భాగాలు ఇతని పరమపదంలో ఉన్నాయి).

**"ఏతావతా మంత్రేణ వైభవం కథితం హరేః"** (ఏతావాన్ - అనే మంత్రంద్వారా హరియొక్క వైభవం తెలుపబడుతున్నది) అని పురుషసంహితలో దీని వైభవం తెలుపబడింది.

**(ఏతావాన్...)** ఈ పురుషోత్తముడు దేశంతో, కాలంతో, వస్తువుతో పరిచ్ఛేదించడానికి సాధ్యం కానివాడు. భోగమోక్షాలను ఇచ్చేవాడు. ముకుందుడు ఇటువంటిది ఇతని మహిమ. ఇందువల్ల ఇతడే గొప్పవాడు.

**(ఏతావాన్ అస్య మహిమా?)** - అని ప్రశ్నార్థకంగా గ్రహించి "ఇంతమాత్రమేనా అతని మహిమ? ఇంతకంటే గొప్పవాడు కదా పురుషుడు?'' అనే అర్థాన్ని కూడా కాకుస్వరం ద్వారా గ్రహించవచ్చు. **"సో అంగ వేద యది వా న వేద"** (తన గొప్పతనాన్ని భగవంతుడు తెలిసికొనగలడా? తెలియలేడా?) అని వేదం. **"తనక్కుమ్ తన్ తన్మై అఱివరియానై"** (తన గొప్పతనాన్ని తాను కూడా తెలియనివానిని) అని నమ్మాళ్వార్లు. అన్నారు. **"యస్యామతం తస్య మతమ్"** (ఎవడు, పరమాత్మను పరిచ్ఛేదించి తెలియరానివాడని భావిస్తాడో, అతడే తెలిసినవాడవుతున్నాడు) అని వేదాలు ఘోషిస్తున్నాయి. వేయి శిరస్సులను కల ఆదిశేషునిచే, సహస్రశీర్షుడైన భగవానునిచే కూడా ఆ గొప్పతనం వర్ణించడం సాధ్యం కాదు. ఎంత వర్ణించినా దానికి మించినవాడుగానే అనంతుడుంటాడు.

**(పాదోస్య....)** - ఈ లోకంలో ఉన్నవి అన్నీ ఇతని ఏకదేశంలో ఇమిడి ఉన్నాయి. **"యస్యాయుతాయుతాంశాంశే విశ్వశక్తి రియం స్థితా"** (ఏ పరమాత్మయొక్క పలు వేల భాగాలలోని ఒక భాగంలో ఈ లీలావిభూతి అణగి ఉన్నదో?...) అని పరాశరమహర్షి విష్ణుపురాణంలో పలికారు.

**(త్రిపాద్)** - అంతు లేని ఈ లీలావిభూతికంటే నిత్యవిభూతి పలు రెట్లు విస్తృతిని కల్గినది. ఇక్కడ **"మూడు"** (త్రి) అనే పదం అనంతమనే అర్థాన్ని ఇస్తుంది. ఇందువల్లనే పరమపదాన్ని త్రిపాద్విభూతి- అని అంటున్నారు.

**(అమృతమ్)** - నశించనిది - అని అర్థం. **"న చ పునరావర్తతే"** (మోక్షాన్ని పొందినవాడు మళ్ళీ తిరిగి ఈ లోకానికి రావడం లేదు) అని వేదం ఘోషించింది. **"పుణై కొడుక్కిలుమ్ పోకవొట్టార్"** (నిచ్చెనను ఇచ్చినా ముక్తుని నిత్యసూరులు తిరిగి పోనివ్వరు) అని పెరియాళ్వార్లు అన్నారు. పరమపదానికి అధిరోహింప జేసి ఎక్కిన తరువాత నిచ్చెనను తీసివేసేవాడుకదా, భగవంతుడు. ఈ పరమపదానికి, అందులో ఉండేవారికి నాశం లేదు. **"తీయనిది"** అనే అర్థాన్ని కూడా దీనికి గ్రహించవచ్చు. **"కనియై క్కరుమ్బినిన్ శా<u>ఱ్ఱై</u> క్కట్టియై త్తేనై యముదై"** (ఫలం వంటివానిని, చెఱకురసం వంటివానిని, ఆరసం గట్టి

పడిన బెల్లపు గడ్డవంటివానిని, తేనెవంటి వానిని, అమృతాన్ని) అనబడే ఆరావముదు. అచ్యుతుని అనుభవించే ప్రదేశమైనందున **"అమృత"**మనబడుతున్నది. **"సోఽశ్నుతే సర్వాన్ కామాన్"** అనే విధంగా భగవద్గుణాలను అనుభవించి, బ్రహ్మానందాన్ని పొందే చోటు కదా, ఇది.

**(దివి)** - ప్రకాశించే పరమపదంలో ఉన్నది. **"అత్యర్కానలదీప్తం తత్ స్థానం విష్ణోర్మహాత్మనః"** (మహాత్ముడైన విష్ణువుయొక్క స్థానం- సూర్యుడు, అగ్ని, మొదలైనవాని కాంతిని అతిక్రమించిన తేజస్సును కల్గినది) అని కదా భారతంలో చెప్పబడింది.

విద్యారణ్యులు ఈ సూక్తానికి భాష్యాన్ని రచించేటపుడు, మహిమ అంటే సామర్థ్యమని, అందువల్ల ఇది వాస్తవం కాదని అన్నారు. ఈ విధంగా అయితే, ఇది ఇంద్రజాలమనే ఏర్పడుతుంది. ఈ విధంగా అనడం సాహసమే తప్ప వేఱు ఏమీ కాదు. **"మహిమా"** అనేది గొప్పతనాన్ని తెల్పుతుంది. **"న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే"** (అతనికి సాటి వచ్చేవాడు గాని, అధికుడు గాని లేదు) అనే విధంగా **"ఒట్టారుమ్ మిక్కార్కళుమ్"** లేని (సాటి మేటి లేని) వాడు, మాధవుడనే ఏర్పడుతుంది. అతనికంటే అధమ వస్తువులు లేకపోతే మహిమ, అనేదే ఏర్పడవు. గొప్పతనం, తక్కువదనం అనేవి ప్రతిబంధి సాపేక్షపదాలు కదా. ఇంతేకాక, భగవానుడు ఉభయవిభూతి నాయకుడని చెప్పబడినందున, ఇక్కడ అద్వైతవాదానికి కొంచెం కూడా చోటు లేదు. **"స చ సర్వస్మాన్మహిమ్నో జ్యాయాన్, తస్మాన్న కోపి జ్యాయాన్"** (అతడు అన్ని మహిమల కంటే గొప్పవాడు. అతనికంటే గొప్పవాడెవడు లేడు) అని ముద్గలోపనిషత్తులో ఈ మంత్రంయొక్క అర్థం తెలుపబడింది.

**4.** **త్రిపాదూర్ధ్వ ముదైత్పురుషః పాదోస్యేహాభవాత్పునః ।**
**తతో విష్వఙ్ వ్యక్రామత్ సాశనాశనే అభి ॥**

పరమపదంలో ఉండే పరమపురుషుడు మూడు అవతారాలను

ఎత్తాలని సంకల్పించాడు. ఇతని ఒక అవతారమైన అనిరుద్ధుడు ఈ లోకంలో అవతరించాడు. ఆ పిమ్మట అన్ని వైపులలో జీవుడు, జడం- అనే వీరిని అవతరింపజేయడం ద్వారా వ్యాపించాడు.

**"త్రిపాదిత్యనయా ప్రోక్త మనిరుద్ధస్య వైభవమ్"** (త్రిపాద్-ఇత్యాది మంత్రంలో అనిరుద్ధనారాయణుని వైభవం తెలుపబడింది) అని పురుషసంహితలో ఈ మంత్రవైభవం చెప్పబడింది.

**(త్రిపాద్....)** - పరమపదంలో ఉండే పరవాసుదేవుడు సంకర్షణుడు, అనిరుద్ధుడు, ప్రద్యుమ్నుడు - అనే మూడు వ్యూహాలను కలవాడై ఉన్నాడు. ఈ వ్యూహాలను గూర్చి పాంచరాత్రానికి చెందిన అహిర్బుధ్న్యసంహితలో వివరంగా వర్ణింపబడింది.

**(ఉదైత్)** - "ఈ లోకాన్ని అంతటిని రక్షిస్తాను'' అని పరవాసుదేవుడు సంకల్పించాడు.

**(అస్య పాదః)** - ఇతని ఒక అవతారమైన అనిరుద్ధుడు.

**(ఇహ అభవాత్ పునః)** - మళ్ళీ తిరిగి ఇక్కడ క్షీరాబ్ధిలో విష్ణువుగా అవతరించాడు.

**(తతో.... వ్యక్రామత్)** - ఆ పిమ్మట అయోధ్య, ద్వారక, మొదలైన దివ్యదేశాలలో రామకృష్ణాదులుగా అవతరించాడు. ఆ అవతారాలకు కూడా వెనుకబడినవారిని సైతం ఉజ్జీవింపజేయడంకోసం శ్రీరంగం, తిరుపతి మొదలైన దివ్యదేశాలలో, గ్రామాలలో, భక్తుల గృహాలలో అంతటా అర్చారూపిగా అవతరించాడు.

**"విష్వఙ్"** అని అన్నందున లెక్కలేనన్ని చోట్ల అవతారాలను ఎత్తడం స్ఫురిస్తుంది. స్వరూపవ్యాప్తి మొదటి మంత్రంలోనే చెప్పబడినందున ఇక్కడ **"వ్యక్రామత్"** అనే దానికి అవతారాలను ఎత్తి వ్యాపించాడనే అర్థమే గ్రహించాలి. ఇతడు ఎందుకోసం ఈ విధంగా అవతరించాలి? అంటే,

**(సాశనాశనే అభి)** - ఆహారాన్ని భుజించేవారైన దేవతలు, మానవులు మొదలైనవారిని, ఆహారాన్ని గ్రహించకుండా శిలాదిరూపంలో ఉండేవారైన చేతనులను ఉజ్జీవింపజేయడంకోసమే ఈ విధంగా పరమపురుషుడు పడరాని పాట్లు పడుతున్నాడు - అని చెప్పబడుతున్నది. **"ఉయిరళిప్పాన్ ఎన్నిష్ట యోనియుమాయ్ ప్పిఱన్దాయ్! ఇమైయోర్ తలైవా!"** (జీవులను రక్షించాలని ఎన్ని జాతులలో జనించావో కదా, నిత్యసూరినాథా!) అని అన్నారు, ఆ**ళ్వా**ర్లు. **"అజాయమానో బహుధా విజాయతే"** (కర్మకృతమైన జన్మను లేనివాడైన భగవంతుడు పలుమార్లు జన్మిస్తున్నాడు) అని వేదం పల్కింది. **"పుఱ్పా ముదలా ప్పుల్లెఱుమ్బాది ఒన్జిన్దియే"** (తృణాలతో సహా అన్నీ ఏమీ లేకుండా) అన్నట్లు తృణాదులను సైతం సద్గతిని పొందించడంకోసం కదా అచ్యుతుడు అవతరిస్తున్నాడు. చేతనాచేతనాలు అన్నీ అతనికి శేషభూతాలే, సొత్తేకదా! సొత్తును గూర్చిన చింత స్వామికే కదా ఉంటుంది. విభవావతారాలనుగూర్చి శ్రీరామాయణం, భారతం, భాగవతం మొదలైనవానిలో విస్తారంగా వర్ణింపబడింది. అర్చావతార మహిమలు పాంచరాత్ర సంహితలలో, వారాహం, బ్రహ్మాండం మొదలైన పురాణాలలో కీర్తింపబడ్డాయి. ఆ**ళ్వా**ర్ల ప్రబంధాలలోకూడా వానిని గమనిస్తున్నాము.

ఈ విధంగా అవతరించినవాడు శ్రీమన్నారాయణుడే; వేఱే దైవం కాదు. **"పరిత్రాణాయ సాధూనామ్"** అనే విధంగా లోకసంరక్షణకోసం పరంధాముడు పలు జన్మలను ఎత్తుతాడు. లోకాలను కాపాడడంకోసం అన్యదైవాలు అవతారాలను ఎత్తలేదు. వారు అవతరించినట్లు చెప్పబడడం కూడా అల్పకార్యాల కోసమే. అవతరాలను ఎత్తి గొప్ప కీర్తిని పొందినవాడు మాధవుడే. వ్యూహరూపాలు దేవతలు చేసే ప్రార్థనలను ఆలకించే చోట్లు. మనకు అవి దరిచేర సాధ్యం కానివి. విభవావతారాలు ఆయా అవతారాలలో జీవించినవారికే అనుభావ్యాలు. **"పుల్లాయ్ శిలైయాయ్ క్కిడన్దిలమే క**ళ్**ల్ తీణ్డుకైక్కే"** (తృణంగా, శిలగా అయినా ఆ శ్రీచరణాలను స్పృశించడానికి ఉండలేకపోయాము కదా!) అని మనం భావించవలసి ఉన్నది. వాటినిగూర్చి

ఇతిహాసపురాణాలలో విని తావన్మాత్రంతో ఆనందిస్తున్నాము. అవి ఏదో ఒక సమయంలో మాత్రం ప్రవహించే కొండవాగులు, నదులవంటివి. వాటిలో తేటపడిన నీటిని కల మడుగులవంటివి అర్చావతారాలు.

5. **తస్మాద్విరాడజాయత విరాజో అధిపూరుషః ।**
**స జాతో అత్యరిచ్యత పశ్చాద్భూమి మథో పురః ॥**

ఆ విష్ణువునుండి బ్రహ్మాండం ఉద్భవించింది. బ్రహ్మాండంలో బ్రహ్మ జనించాడు. ఆ బ్రహ్మ భూమి. పక్కలలోను, క్రింద, పైన ఆక్రమించాడు.

**"తస్మాద్విరాడిత్యనయా పాదనారాయణాత్ హరేః, ప్రకృతేః పురుషస్యాపి సముత్పత్తిః ప్రదర్శితా"** ("తస్మాద్విరాట్' అనే మంత్రం ద్వారా నారాయణుని ఒక అవతారమైన హరినుండి ప్రకృతి యొక్క బ్రహ్మయొక్క ఉత్పత్తి చూపబడింది) అని పురుషసంహితలో ఈ మంత్రంయొక్క అర్థం తెలుపబడింది.

**(తస్మాత్...)** - ఈ విధంగా వలు అవతరాలను ఎత్తిన మహావిష్ణువునుండి అండం రూపంలోని ఒక బ్రహ్మాండం ఉద్భవించింది. **"అయం లోకస్తు వై సమ్రాట్ అంతరిక్షం విరాట్"** (ఈలోకం సమ్రాట్ అని, అంతరిక్షం విరాట్ అని చెప్పబడుతున్నది) అని వాయుపురాణంలో **"విరాట్"** అనేది అంతరిక్షాన్ని మాత్రం తెల్పుతుందని చెప్పబడినా, ఇక్కడ లోకాలను లోపల కల్గిన బ్రహ్మాండాన్నే నిర్దేశిస్తుందని చెప్పవచ్చు.

**(విరాజో...)** - ఆ బ్రహ్మాండాన్ని ఆశ్రయించి, బ్రహ్మ పుట్టాడు. అండానికి అధికారపురుషుడైన బ్రహ్మ పుట్టాడని కూడా అర్థాన్ని చెప్పవచ్చు. సుబాలోపనిషత్తులో **"అండమ్ సమభవత్"** (అండం జనించింది) అని, **"మధ్యే పురుషః"** (మధ్యలో బ్రహ్మ అనే పురుషుడు పుట్టాడు) అని ఈ విషయమే చెప్పబడినందున ఈ విధంగా సృష్టించినవాడు నారాయణుడే - అని తెలియగల్గుతున్నాము. దీనివల్ల అండసృష్టి అనేది అనాదిపురుషుడు,

అకారవాచ్యుడైన అనంతునిదే - అని తెలుపబడుతున్నది. ఈ విధంగా సృష్టింపబడిన అండాలు ఒకటి, రెండు కాదు. బ్రహ్మాండాలు కూడా అనేకమే. దీనినే పెరియాళ్వార్లు **"అణ్డక్కులత్తుక్కదిపతియాకి"** (అండ సమూహానికి అధిపతియై) అని అన్నారు. బ్రహ్మ తనను తాను సృష్టించుకోలేదు. అండసృష్టి అతని శక్తికి మించినది. ప్రజాసృష్టియే అతని శక్తికి సాధ్యమైనది. అదికూడా అచ్యుతుని కృపవల్ల, ఆజ్ఞవల్ల సంభవిస్తున్నది ఈ విధంగా ప్రజాసృష్టి చేసిన కాలంలో జీవులు "వేసిన కాలు వేసిన చోటులోనే" చేష్టారహితులై ఉన్నారు. తరువాత, బ్రహ్మ మాధవునివద్ద మొఱపెట్టినట్లు, అతడు సర్వేంద్రియాలలో వ్యాపించి, వాటి కార్యాన్ని చేసే శక్తి ఇచ్చినట్లు తెలుస్తున్నది. పూర్వం తెల్పిన పలు ఉపనిషత్తులలో చెప్పబడ్డ నారాయణుడే ఈ విధంగా అన్ని విధాలుగా సృష్టిచేస్తున్నాడని తెలుస్తున్నది.

**(స జాతో....)** ఆ బ్రహ్మ భూమిని, నాల్గు వైపులలోను కింద, పైన వ్యాపించాడని చెప్పబడుతున్నది. **"పశ్చాత్"** అని అన్నందున అన్ని ద్వీపాలలో **"అధః"** అని అన్నందున పాతాళంలోను, **"పురః"** అని అన్నందున స్వర్గాదిలోకాలలోను వ్యాపించాడని తెలుస్తున్నది. బ్రహ్మయొక్క స్వరూపం అణువైనందున, స్వరూపంతో వీరిని వ్యాపించడం సాధ్యం కాదు. అందువల్ల, జ్ఞానం, శక్తి మొదలైన గుణాలద్వారా వ్యాపించాడనే చెప్పాలి. తన జ్ఞానంతో పదునాల్గు లోకాలలోను జరుగవలసినవానిని తెలిసికొని, శక్తితో సృష్టి చేస్తున్నందున ఈ అండంలో ఉండే అన్ని లోకాలలో జ్ఞానంతో, శక్తితో వ్యాపించాడు- అనే చెప్పాలి. శ్రీవిష్ణుచిత్తులు "తన ప్రజల మూలంగా వ్యాపించాడు" అనే అర్థాన్ని గ్రహించారు. పెద్ద శరీరంతో వ్యాపించాడని కూడా చెప్పవచ్చు. **"స చ పాదనారాయణః జగత్ స్రష్టుం ప్రకృతిం అజనయత్"** (నారాయణుని అవతారమైన ఆ విష్ణువు లోకాన్ని సృష్టించడం కోసం బ్రహ్మను సృష్టించాడు) అని ఈ మంత్రంలోని అర్థాన్ని ముద్గలోపనిషత్తులో వివరింపబడింది. ఇక్కడ ప్రకృతిశబ్దం ప్రజలకు కారణభూతుడైన బ్రహ్మను తెల్పుతుంది.

6. యత్పురుషేణ హవిషా దేవ యజ్ఞ మతన్వత ।
వసంతోస్యాసీదాజ్యం గ్రీష్మ ఇధ్మ శరద్ధవిః ॥

(దేవతలు-దివ్యసూరులు-చతుర్ముఖుడనే హవిస్సుతో సృష్టిని ఉద్దేశించి చేసిన ధ్యానరూపమైన యాగానికి వసంత ఋతువు నేయిగా, గ్రీష్మ ఋతువు సమిధలుగా, శరద్ ఋతువు పురోడాశమనే హవిస్సుగాను అయినది.

**"యత్పురుషేణేత్యనయా సృష్టియజ్ఞ స్సమీరితః" ("యత్ పురుషేణ"** అనే మంత్రంతో సృష్టికోసం చేయబడిన యజ్ఞం చెప్పబడింది) అని పురుష సంహితలో ఈ మంత్రార్థం తెలుపబడింది.

ఈ మంత్రం ద్వారా సృష్టిని ఉద్దేశించి యజ్ఞం చేయబడిన విషయం వివరింపబడుతున్నది. బ్రహ్మకు అతడు పుట్టినపుడు సృష్టిశక్తి లేదని దీనివల్ల తెలుస్తున్నది. చతుర్ముఖునకు సృష్టించే శక్తి కల్గడంకోసం భగవంతుని గూర్చి యజ్ఞాన్ని చేశారు - అని ఏర్పడుతున్నది.

**(యత్ పురుషేణ...)** ఈ బ్రహ్మ అనే పురుషుని ఆ యజ్ఞంలో హోమం చేయబడే హోమపశువుగా (హవిస్సుగా) కల్పించారు. ఎవరు కల్పించారు? అంటే,

**(దేవాః)-** దేవతలు. మఱి, ఆ దేవతలెవరు? అనే ప్రశ్న వెంటనే ఇక్కడ కల్గుతుంది. ఇంద్రాదిదేవతలా? అంటే, సృష్టిశక్తిని పొందిన తరువాత బ్రహ్మచే సృష్టింపబడిన కశ్యపప్రజాపతికి అదితినుండి పుట్టినవారు, వారు. అందువల్ల, ఇక్కడ చెప్పబడిన దేవతలు వారు కారు. కనుక, ప్రకాశించేది, పరమాకాశమని కీర్తిని కల్గినదైన శ్రీవైకుంఠంలో ఉండే నిత్యసూరులే ఇక్కడ చెప్పబడే దేవతలని భావించాలి.

**(యత్ యజ్ఞమ్ అతన్వత అస్య)** - బ్రహ్మను యజ్ఞపశువుగా చేసికొని, ఏ ధ్యానరూపమైన యజ్ఞాన్ని చేశారో, ఆ యజ్ఞానికి.

**(వసంతః ఆజ్యమ్ ఆసీత్)** - వసంత ఋతువు నేయిగా,

గ్రీష్మఋతువు సమిత్తుగా, శరదృతువు పురోడాశమనబడే హవిస్సుగా అయినవి. ఈ యజ్ఞం పరమపురుషుని ఉద్దేశించి సృష్టికోసం చేయబడిన ధ్యానరూపమైన యజ్ఞం. సృష్టికి కాలం అనేది తప్పక ఆవశ్యకం కనుక, అది ఈ విధంగా ఉపకరణంగా చెప్పబడింది. **"పురుషేణ హవిషా"** అనే చోట బ్రహ్మ యాగపశువు అనే హవిస్సు అయ్యాడు - అని చెప్పబడింది. **"శరద్ధవిః"** అనేచోట శరత్కాలం పురోడాశమైనది - అని చెప్పబడినది. బియ్యపు పిండితో చేయబడి, హోమం చేయబడే భక్ష్యం పురోడాశ మనబడుతుంది. నిత్యసూరులు బ్రహ్మను సృష్టికి ముఖ్యమైన ఉపకరణంగా, కాలాన్ని సహకారిగాను గ్రహించి, ప్రజాసృష్టికోసం భగవానుని ధ్యానించారని భావం. ఆ విధంగా వారు చేయడానికి కారణం భగవన్నియమనమే - అని మనం ఊహించవలసి ఉన్నది.

ఇక్కడ చెప్పబడిన సృష్టి **"బహుస్యాం ప్రజాయేయ"** (నేను అనేకంగా అవుతాను) అనే సంకల్పంతో నిమిత్తోపాదానకారణమైన నారాయణునిచే చేయబడే సమిష్టిసృష్టి కాదు. ఇది వ్యష్టిసృష్టి అనబడే ప్రజాసృష్టియే. ఇటువంటి శక్తి నిత్యసూరులకు ఉన్నది - అనేదానికి పలు ఆధారాలున్నాయి. విష్వక్సేనుని మంత్రంలో **"విశ్వసృజే"** (లోకాన్ని సృష్టించేవానికొఱకు) అని చెప్పబడుతున్నది. నారదీయమనే ప్రసిద్ధమైన హరిభక్తిసుధోదయంలోని అయిదవ అధ్యాయంలో **"తే హి కుర్యుః యదీచ్ఛంతి జగత్సర్గలయౌ స్వయమ్"** (నిత్యసూరులు, కావాలని అనుకొంటే, జగత్ సృష్టి సంహారాలను తామే చేయగలరు) అని చెప్పబడింది. ఆళవందార్ **"త్వయా నిసృష్టాత్మభరేణ"** (నీచే పెట్టబడిన ఉభయవిభూతుల నిర్వాహాన్ని కల విష్వక్సేనునిచే) అని భగవంతుని స్తుతించారు. శ్రీరామానుజులుకూడా- **"స్వసంకల్పమాత్రావక్లుప్త జగజ్జన్మ స్థితిధ్వంసాదికే శ్రీమతి విష్వక్సేనే న్యస్తసమస్తాత్మైశ్వర్యమ్"** (తన సంకల్పంతో ఇవ్వబడిన జగత్సృష్టిస్థితి లయాలను కల శ్రీవిష్వక్సేనులపై పెట్టడిన తన ఐశ్వర్యాన్ని అంతటిని కలవానిని) అని శ్రీవైకుంఠగద్యంలో పలికారు. బ్రహ్మ అనే జీవునకు ఈ శక్తి ఉన్నపుడు, అతనికంటే పలు వేలరెట్లు గొప్పవారైన నిత్యసూరులకు ఈ శక్తి ఉండడంలో ఏమీ ఆశ్చర్యం లేదు. ఈ యాగంవల్ల బ్రహ్మకు సృష్టి

చేసే శక్తి లభిస్తుందని, ఆ బ్రహ్మను నిమిత్తకారణంగా గ్రహించి, తన్మూలంగా నిత్యసూరులు సృష్టిని చేయిస్తున్నారని దీనివల్ల తెలుస్తున్నది. ముద్గలోపనిషత్తులో దీని అర్థం వేఱు రీతిలో తెలుపబడింది.

**"స సమృద్ధకాయ స్సన్ సృష్టికర్మ న జజ్ఞివాన్, సః అనిరుద్ధనారాయణః తస్మై సృష్టిం ఉపాదిశత్. "బ్రహ్మన్! తవ ఇంద్రియాణి యాజకాని ధ్యాత్వా, కోశభూతం దృఢగ్రంథిం కలేవరం హవిర్ధ్యాత్వా మాం హవిర్భుజం ధ్యాత్వా, వసంతకాలమ్ ఆజ్యం ధ్యాత్వా గ్రీష్మమ్ ఇధ్మం ధ్యాత్వా, శరదృతుం రసం ధ్యాత్వా, ఏవం అగ్నే హుత్వా, అంగస్పర్శాత్ కళేవరః వజ్రం హీష్యతే, తతః స్వకార్యాన్ సర్వప్రాణిజీవాన్ సృష్ట్వా పశ్వాద్యాః ప్రాదుర్భవిష్యంతి, తతః స్థావరజంగమాత్మకం జగద్భవిష్యతి"** (గొప్ప దేహాన్ని కల ఆ బ్రహ్మ సృష్టినిగూర్చి తెలియలేదు. ఆ అనిరుద్ధనారాయణుడు. అతనికి సృష్టినిగూర్చి ఉపదేశించాడు. "ఓ బ్రహ్మా! నీ ఇంద్రియాలను యాగం చేసేవారిగా, శరీరాన్ని హవిస్సుగా, నన్ను ఆ హవిస్సును భుజించేవానిగా, వసంతకాలాన్ని నేయిగా, గ్రీష్మఋతువును సమిత్తుగా, శరదృతువును హోమం చేయబడే షడ్రసంగా ధ్యానించి, ఈ రీతిలో అగ్నిలో హోమం చేయి. దానిస్పర్శ వల్ల నీ శరీరం వజ్రంవలె సృష్టి చేయడానికి సమర్థంగా అవుతుంది. తరువాత, నీ నుండి పుట్టే సర్వప్రాణులను సృజింప చేసికొని, పశువులు మొదలైనవి జన్మించబోతాయి. ఆ పిమ్మట స్థావరజంగమాత్మకమైన జగత్తు పుడుతుంది) అని దీని భావం.

దీనివల్ల మొదట బ్రహ్మసృష్టిని చేయడానికి తగిన జ్ఞానాన్ని, శక్తిని లేనివాడై తికమక పడగా, భగవానుడు అతనికి సృష్టి చేసే దారిని గూర్చి ఉపదేశించాడని తెలుస్తున్నది. **"మహాదేవః సర్వమేధే మహాత్మా హుత్వాత్మానం దేవదేవో బభూవ"** (మహాత్ముడైన దేవదేవుడు (శివుడు) సర్వమేధమనే యాగంలో తనను హోమం చేసికొని, దేవతల కందటికి దేవుడయ్యాడు) అనే రీతిలో, బ్రహ్మకూడా భగవానుని ఉద్దేశించి ఆత్మసమర్పణమనే యాగాన్ని చేసి సృష్టి చేసే శక్తిని పొందాడని తెలుస్తున్నది.

7. సప్తాస్యాసన్ పరిధయః త్రిస్సప్త సమిధః కృతాః ।
దేవా యద్యజ్ఞం తన్వానాః అబధ్నన్ పురుషం పశుమ్॥

(ఈ యజ్ఞానికి ఏడు వస్తువులు పరిధులు అయ్యాయి. ఇరవై ఒక్క వస్తువులు సమిత్తులుగా చేయబడ్డాయి. యజ్ఞాన్ని చేసే దేవతలు చతుర్ముఖుడనే పురుషుని హోమం చేయబడే పశువుగా బంధించారు.)

**(సప్తా.... పరిధయః)** - యాగం చేసేటపుడు అగ్నికి - దక్షిణం, పడమర, ఉత్తర దిక్కులలోను, ఉత్తరవేదికి - దక్షిణం, పడమర, ఉత్తరదిక్కులలోను ఆఱు దండాలు (పాలాశం మొదలైన వృక్షాల దండాలు) పెట్టబడతాయి. తూర్పుదిక్కులో సూర్యుని చేర్చి, మొత్తం ఏడు పరిధులుగా లెక్కింపబతాయి. ఈ సృష్టియజ్ఞంలో కూడా ఏడే పరిధులు ఏర్పడ్డాయని ఇక్కడ తెలుపబడుతున్నది. అవి ఏవి? అంటే, పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం - అనే అయిదు భూతాలు, అహంకారం, మహాన్ - అనే తత్త్వాలు రెండు. మొత్తం ఏడు.

**(త్రిస్సప్తః సమిధః కృతాః)** - ఇక్కడ ఇరవై ఒక్క సమిత్తులు అగ్నిలో హోమం చేయడంకోసం కల్పించబడ్డాయి. అవి ఏవి ? అంటే, పృథివి మొదలైన అయిదు భూతాలు(5), వీటికి కారణమైన శుద్ధతన్మాత్రలు(5) (గంధతన్మాత్ర, రసతన్మాత్ర, రూపతన్మాత్ర, స్పర్శతన్మాత్ర, శబ్దతన్మాత్ర) కన్ను, చెవి, నాలుక, ముక్కు, త్వక్కు- అనే అయిదు(5) జ్ఞానేంద్రియాలు, కాళ్ళు, చేతులు, నోరు, ఆడ మగ చిహ్నాలు, ఆసనరంధ్రం - అనే అయిదు(5) కర్మేంద్రియాలు, మనస్సు(1) - మొత్తం ఇరవై ఒక్క(5+5+5+5+1=21) తత్త్వాలు సమిధలుగా కల్పింపబడ్డాయి. ప్రజలను సృష్టించడానికి ఇవి ఉపకరణాలు కనుక, సృష్టియజ్ఞానికి సామగ్రిగా చెప్పబడ్డాయి.

**(దేవా.... పశుమ్)** - ఈ విధంగా యజ్ఞం చేసేవారైన నిత్యసూరులు, యజ్ఞంలో హోమం చేయబడే పశువైన బ్రహ్మను ప్రకృతి అనే యూపస్తంభానికి బంధించారు. తరువాత మంత్రంతో **"బర్హిషి యజ్ఞం ప్రౌక్షన్"** (మూలప్రకృతిలో

ఉండే (బ్రహ్మను (ప్రోక్షించారు) అని చెప్పబడుతున్నందున ఇక్కడ మూల(ప్రకృతి అనే యూపస్తంభంలో బంధించారు - అనే గ్రహించాలి.

8. **తం యజ్ఞం బర్హిషి (ప్రౌక్షన్ పురుషం జాతమ(గతః ।**
**తేన దేవా అయజంత సాధ్యా ఋషయ శ్చ యే ॥**

మొదట జన్మించినవాడు, యజ్ఞంలో హోమం చేయబడేవాడు మూల(ప్రకృతిలో బంధింపబడినవాడైన (బ్రహ్మ అనే పురుషుని (ప్రోక్షించారు. సాధ్యులని చెప్పబడే నిత్యసూరులు, ఋషులు (ముక్తులు) ఆ పశువుతో యజ్ఞం చేశారు.

**(తమ్ యజ్ఞమ్)** - యజ్ఞంలో హోమం చేయబడేవాడైన ఆ (బ్రహ్మను,

**(బర్హిషి) - "బర్హిః"** అనే పేరును కల మూల(ప్రకృతిలో ముందు తెల్పిన రీతిలో కట్టి,

**((ప్రౌక్షన్)** - (ప్రోక్షణమనే సంస్కారాన్ని చేశారు.

**(పురుషం జాతమ(గతః)** - ముందు పుట్టినవాడైన ఆ (బ్రహ్మ అనే పురుషుని (ప్రోక్షించారు. **"(బ్రహ్మా దేవానాం (ప్రథమ స్సంభూవ"** (దేవతలలో మొదటివాడుగా (బ్రహ్మ పుట్టాడు) అని ముండకోపనిషత్తులో చెప్పబడినందున ఇక్కడ చెప్పబడిన పురుషుడు (బ్రహ్మయే అని నిశ్చయింపబడుతున్నది.

**(తేన అయజంత)** - ఆ (బ్రహ్మను పశువుగా (గ్రహించి యాగం చేశారు. ఒక (ద్రవ్యాన్ని ఒక దేవతను ఉద్దేశించి సమర్పించడం యాగమనబడుతుంది. ఇక్కడ చతుర్ముఖుడనే హవిస్సును అనిరుద్ధనారాయణునకు అగ్నిలో హోమం చేయడమనే యజ్ఞాన్ని చేశారు - అని తాత్పర్యం. ఎవరు ఈ విధంగా హోమం చేశారు? అంటే,

**(సాధ్యా దేవాః)**- సాధ్యులని (ప్రసిద్ధి చెందిన నిత్యసూరులే ఈ విధంగా యాగం చేశారు - అని చెప్పబడుతున్నది. ఈ పురుషసూక్తంలోని

పూర్వానువాకంలో చివరి మంత్రంలో **"యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః"** (ఏ పరమపదంలో ప్రాచీనులైన సాధ్యులు అని చెప్పబడేవారైన దేవతలున్నారో) అని చెప్పబడినందున, ఇక్కడ చెప్పబడే దేవతలు నిత్యసూరులే అని నిర్ణయింపబడుతున్నది.

**(ఋషయ శ్చ యే)** - ముక్తులు ఈ యజ్ఞంలో కలిశారు- అని ఇందులో చెప్పబడుతున్నది. బ్రహ్మకు సృష్టిశక్తి కల్గిన తర్వాత సృష్టింపబడినవారైన అత్రి, భృగు, వశిష్ఠాది ఋషులు ఇక్కడ చెప్పబడే ఋషులు కారు. అందుచేత ముక్తులే ఇక్కడ ఈ పదంచేత చెప్పబడుతున్నారు. పురుషోత్తముని ధ్యానం చేయడమే తమకు భుజించే అన్నం, తాగే నీరు, ఆస్వాదించే భోగ్యవస్తువులుగా కల్గి ఉండే ముక్తులను ఋషులు - అని అనడంలో లోటు లేదు.

9. **తస్మాద్యజ్ఞాత్ సర్వహుతః సంభృతం పృషదాజ్యమ్ ।**
**పశూంస్తాం చక్రే వాయవ్యాన్ ఆరణ్యాన్ గ్రామ్యాంశ్చ యే ॥**

(అన్నిటిని హోమం చేయబడిన ఆ బ్రహ్మనుండి పెరుగుతో కూడిన నెయ్యి (జగత్కారణ భూతుడైన విశ్వం) జనించింది. ఆ చతుర్ముఖుడు వాయుమార్గంలో సంచరించి, పక్షులను, అరణ్యంలో సంచరించే మృగాలను, గ్రామాలలో ఉండే మృగాలను సృష్టించాడు.)

**"తస్మాదితి చ మంత్రేణ జగత్సృష్టి స్సమీరితా"** (**"తస్మాత్"** అనే మంత్రంతో జగత్సృష్టి చెప్పబడింది) అని పురుషసంహితలో దీని అర్థం చెప్పబడింది. 'చ'కారంద్వారా దీనినుండి ఆరంభించి ఏడు మంత్రాలలో జగత్సృష్టి తెలుపబడిందనే విషయం సూచింపబడింది.

**(సర్వహుతః తస్మాద్యజ్ఞాత్)** - తనతో పాటు కూడిన అన్నిటిని హోమం చేయబడిన ఆ బ్రహ్మనుండి - అని అర్థం. నిత్యసూరులచే భగవానునివద్ద ఆత్మసమర్పణం చేయబడిన ఆ చతుర్ముఖుని వద్దనుండి,

**(పృషదాజ్యం సంభృతమ్)** - పెరుగుతో కూడిన నేయి ఉద్భవించింది. ఇక్కడ **"పృషదాజ్యమ్"** అనేది జగత్సృష్టికి కారణమైన వీర్యాన్ని తెల్పుతున్నది.

**(పశూంస్తాన్....)** వాయువు సంచరించే ఆకాశంలో ఎగిరే పక్షులను, అరణ్యంలో సంచరించే పులి, సింహం మొదలైన ప్రాణులను, గ్రామాలలో తిరిగే పిల్లి మొదలైన ప్రాణులను ఆ చతుర్ముఖుడు సృష్టించాడు.

**10.** **తస్మాద్యజ్ఞాత్ సర్వహుతః ఋచ స్సామాని జజ్ఞిరే ।**
**ఛందాంసి జజ్ఞిరే తస్మాత్ యజు స్తస్మాదజాయత ॥**

(అన్నిటతో హోమం చేయబడిన ఆ బ్రహ్మనుండి ఋగ్వేదాలు, సామవేదాలు జనించాయి. ఆ చతుర్ముఖునివద్ద నుండి ఛందస్సులు పుట్టాయి. యజుర్వేదం కూడా ఆ బ్రహ్మనుండి పుట్టింది.

బ్రహ్మనుండి ఋగ్యజుస్సామవేదాలు, గాయత్రి మొదలైన ఛందస్సులు పుట్టాయని ఇందులో చెప్పబడుతున్నది. **"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై"** (ఏ పరమాత్మ సృష్టికాలంలో బ్రహ్మను సృష్టించి, అతనికి వేదాలను ఉపదేశించాడో) అని చెప్పబడినందున పరమపురుషునివద్దనుండి ఉపదేశాన్ని పొంది వేదాలను బ్రహ్మ వ్యక్తం చేశాడు - అని గ్రహించాలి. **"తస్య హ వా ఏకస్య మహతో భూతస్య నిశ్వసితం ఏతదృగ్వేదో యజుర్వేద స్సామవేదో...."** (ఋగ్యజుస్సామవేదాలన్నీ పరమాత్మయొక్క నిశ్వాసరూపాలు) అని మహాపురుషుని నిశ్వాసంగా చెప్పబడిన అపౌరుషేయమైన వేదాలను బ్రహ్మ ప్రకాశింపజేశాడని తెలుస్తున్నది.

**11.** **తస్మాదశ్వా అజాయంత ఏకేచో భయాదతః ।**
**గావో హ జజ్ఞిరే తస్మాత్ తస్మాజ్జాతా అజా వయః ॥**

ఆ చతుర్ముఖునివద్దనుండి గుఱ్ఱాలు, ఒక వైపు దంతాలను కల ఎనుములు మొదలైన ప్రాణులు, రెండు వైపుల పళ్ళను కల్గిన గాడిదలు

మొదలైనవి పుట్టాయి. ఆ బ్రహ్మనుండి పశువులు కూడా పుట్టాయి.

**(గావో హ...)** ఒక వైపు దంతాలను కల మృగాలలో పశువులు (గోవులు) చేరినా, వాటి ఔన్నత్యాన్నిబట్టి అవి మళ్ళీ ప్రత్యేకంగా ప్రస్తావింపబడ్డాయి - అని శ్రీవిష్ణుచిత్తాచార్యులవారు వ్యాఖ్యానం చేశారు. పురుషోత్తముని ఆరాధనమైన యజ్ఞానికి ఉపయోగపడే పాలు, పెరుగు, నేయి మొదలైనవి పశువులనుండి కదా లభిస్తున్నాయి.

**12. యత్పురుషం వ్యదధుః కతిధా వ్యకల్పయన్।**
**ముఖం కి మస్య కౌ బాహూ కా వూరూ పాదా వుచ్యేతే ॥**

బ్రహ్మ అనే పురుషుని యజ్ఞపశువుగా చేసినపుడు ఎంత రీతిలో కన్పించారు? ఈ బ్రహ్మయొక్క ముఖంగా ఏది అయినది? బాహువులుగా ఎవరు అయ్యారు? తొడలుగా, పాదాలుగా ఎవరు చెప్పబడుతున్నారు?

యజ్ఞాన్ని చేసే బ్రాహ్మణులు మొదలైనవారి సృష్టిని గూర్చి ఈ మంత్రం, తరువాత మంత్రం తెలుపుతున్నాయి. ఈ ఋక్కు ప్రశ్నరూపంగాను, తరువాత ఋక్కు సమాధానంగాను ఉన్నాయి. నిత్యసూరులు బ్రహ్మను పశువుగా కల్పించినపుడు అతని అంగాలు ఎన్ని విధాలుగా కల్పింపబడ్డాయి? - అని, ఏ యే అవయవాలనుండి ఏయే పదార్థాలు సృష్టింపబడ్డాయని ఇందులో ప్రశ్నింపబడుతున్నది.

**13. బ్రాహ్మణోస్య ముఖ మాసీత్ బాహూ రాజన్యః కృతః ।**
**ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత॥**

బ్రాహ్మణుడు ఇతనికి ముఖమయ్యాడు. బాహువులు క్షత్రియులయ్యారు. ఊరువులు వైశ్యులయ్యారు. పాదాలనుండి శూద్రులు పుట్టారు.

**(బ్రాహ్మణోస్య....)** ముఖం బ్రాహ్మణులుగా అయినది. అని ఇందులో

చెప్పబడుతున్నది. "పాదాలనుండి శూద్రులు పుట్టారు." అని చివరలో చెప్పబడినందున, ఇక్కడ కూడా ముఖం నుండి బ్రాహ్మణులు పుట్టారు - అని తాత్పర్యం. బ్రాహ్మణులు అధికంగా జ్ఞానం కల్గినవారైనందున, జ్ఞానేంద్రియాలను అన్నిటిని కల్గి ఉండే ముఖం నుండి బ్రాహ్మణులను బ్రహ్మ సృష్టించాడు.

**(బాహూ... కృతః)** - బాహువులనుండి క్షత్రియులు పుట్టారు. యుద్ధాన్ని చేయడం తమ వృత్తిగా కల క్షత్రియులకు బాహుబలం, హస్తలాఘవం ఆవశ్యకం కనుక, బ్రహ్మదేవుడు వారిని తన బాహువులనుండి సృష్టించాడు.

**(ఊరూ.... యద్వైశ్యః)** వ్యవసాయాన్ని వృత్తిగా కల్గిన వైశ్యునకు ఊరుబలం ముఖ్యం కనుక, చతుర్ముఖుడు అతనిని తన ఊరువుల నుండి సృష్టించాడు.

**(పద్భ్యాం....)** పాదాలనుండి నాల్గవ వర్ణానికి చేరిన శూద్రుడు జనించాడు. మొదట మూడు వర్ణాలకు చెందినవారికి సేవ చేయడమే స్వధర్మంగా కల శూద్రునకు కాలి బలం ఆవశక్యం కనుక, బ్రహ్మవారిని తన పాదాలనుండి సృష్టించాడు.

ఇతిహాసపురాణాలలో పలు చోట్ల నారాయణుని ముఖం, బాహువులు, ఊరువులు, పాదాలు మొదలైనవానినుండి నాల్గు వర్ణాల వారిని సృష్టించినట్లు చెప్పబడగా, ఇక్కడ చతుర్ముఖుని అంగాలనుండి వారు జన్మించారని అనడం ఏ విధంగా పొసగుతుంది? అనే సందేహం కలుగవచ్చు. బ్రహ్మను శరీరంగా కల పురుషోత్తముడే ఈ విధంగా సృష్టించినందున, చతుర్ముఖుని అవయవాలు నారాయణుని అవయవాలే కనుక, ఇందులో ఏ విరోధం లేదు.

**14.** చంద్రమా మనసో జాతః చక్షోః సూర్యో అజాయత ।
ముఖాదింద్ర శ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయు రజాయత ॥

(మనస్సునుండి చంద్రుడు పుట్టాడు. కన్నులనుండి సూర్యుడు

పుట్టాడు. ముఖంనుండి ఇంద్రుడు, అగ్ని జనించారు. (ప్రాణాలనుండి వాయువు పుట్టాడు.)

ఈ మంత్రంలో సర్వలోకోపకారకమైన సృష్టి తెలుపబడుతున్నది.

**(చంద్రమా... జాతః)** చంద్రుడు మనస్సునుండి పుట్టాడు. మనస్సునుండి చంద్రుడు ఎందుకు పుట్టాడు? మిగిలిన ఏదో ఒక అంగం నుండి ఎందుకు పుట్టి ఉండకూడదు? బ్రహ్మను శరీరంగా భగవంతుని మనస్సుకు, చంద్రునకు ఏవిధమైన సామ్యం ఉన్నది? లోకంలో ఉండేవారి మనస్సుకు చంద్రుడు సంతోషాన్ని ఇస్తాడు. కనుక, చంద్రుడు మనస్సునుండి సృష్టింపబడ్డాడు. అతడు లోకంలో ఉండే జీవులకు, పైర్లకు చల్లదనాన్ని, సంతోషాన్ని కల్గించేవాడు. అతని కిరణాలే పైరుకు ప్రాణాన్ని పోస్తాయి. చంద్రుడు లేకపోతే లోకం నశించి పోతుంది. కేశవుడు చల్లని, శుభకరమైన మనస్సును కలవాడు. అటువంటి మనస్సుతో అందరినీ ఉజ్జీవింపజేయాలని సంకల్పించి, అద్వేషాన్ని కల్గించి, ఆభిముఖ్యాన్ని వృద్ధి చేసి, జ్ఞానమనే పైరును భగవంతుడు వృద్ధి చేస్తున్నాడు. ఇంతేకాక, చంద్రుడు మనస్సుకు అధిదేవత కూడా. ఈ కారణంవల్ల చంద్రుడు పురుషోత్తముని మనస్సునుండి జనించాడు.

**(చక్షో స్సూర్యో... అజాయత)** - లోకానికి నేత్రమై ఉండేవాడు, బాహ్యాంధకారాన్ని పారదోలేవాడైన సూర్యుడు అజ్ఞానమనే చీకటిని పోగొట్టే ఈ లోకానికి, పరమపదానికి నేత్రభూతుడైన శ్రీకృష్ణుని నేత్రంనుండి పుట్టాడు. లోకాన్ని దర్శించగలిగేటట్లు నేత్రం చేస్తుంది. సూర్యుడు కూడా చూడడానికి సాధనంగా ఉన్నాడు. సూర్యుడు నేత్రానికి అధిదేవత. కంటిరోగాలు సూర్యనమస్కారం చేయడంవల్ల పోగొట్టబడుతున్నాయని చెప్పబడుతున్నది. సూర్యనమస్కారం వేదంలో కూడా చెప్పబడింది. సూర్యనమస్కారంలో కూడా **"ధ్యేయ స్సదా సవితృమండలమధ్యవర్తీ నారాయణః"** (సూర్యమండలం మధ్యలో ఉండే నారాయణుడు సదా ధ్యానించదగినవాడు) అని చెప్పబడిన పుండరీకాక్షుడైన నారాయణుడే నమస్కరింపబడుతున్నాడు. సూర్యుడు తన

కిరణాలతో బాహ్యాంధకారాన్ని పోగొట్టి, ప్రాణులకు ఉష్ణాన్ని ఇచ్చి, జీవించేటట్లు చేస్తాడు. కేశవుని నేత్రంనుండి పుట్టే కటాక్షంతో జీవులు అజ్ఞానం నశించగా, జ్ఞానాన్ని పొంది, మోక్షాన్ని పొందుతున్నారు. ఆదిత్యుడు తేజోమయుడు. అచ్యుతుడు కూడా తేజోమయమైన తామరలవంటి కన్నులను కలవాడు. **"తస్య యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ"** (ఆ పరమపురుషునకు సూర్యునిచే వికసించే తామరలవంటి రెండు కన్నులున్నాయి) అని కదా పరబ్రహ్మ లక్షణం చెప్పబడుతున్నది. ఈ కారణాలవల్ల పరంధాముని నేత్రాలనుండి భాస్కరుడు పుట్టాడు.

**(ముఖాదింద్రశ్చ.....)** ముఖం ఆధిపత్యాన్ని, తేజస్సును చూపుతున్నది. అందువల్ల, దేవతలకు అధిపతి, తేజోవంతుడైన ఇంద్రుడు ముఖంనుండి పుట్టాడు. తేజోమయుడైన అగ్నికూడా ముఖంనుండి ఉద్భవించాడు. **"అగ్ని ముఖా వై దేవాః"** (దేవతలు అగ్నిని ముఖంగా కలవారు) అనేరీతిలో దేవతలకు ముఖమైన అగ్ని, పురుషుని ముఖం నుండి పుట్టడం న్యాయమే.

**(ప్రాణాద్వాయు రజాయత)** - ప్రాణాలనుండి వాయువు పుట్టాడు. ప్రాణుడు ఒక వాయువిశేషమే కదా! అందువల్ల దానినుండి వాయువు పుట్టాడు. అందఱికి ప్రాణమై ఉండే వాయువు ప్రాణాలనుండి పుట్టడమనేది తగినదే. వాయువు లేకపోతే జీవించడం వీలు కాదు. హనుమంతుడు వజ్రాయుధంతో ఇంద్రునిచే కొట్టబడినపుడు వాయుస్తంభించడం, లోకమంతా అపుడు తల్లడిల్లడం అనేది అందఱు ఎరిగిన వృత్తాంతమే. ఈ విధంగా లోకానికి ఉపకారకాలైన వస్తువులు సృష్టింపబడ్డాయి.

**15.** **నాభ్యా ఆసీదంతరిక్షం శీర్ష్ణో ద్యౌ స్సమవర్తత ।**
**పద్భ్యాం భూమి ర్దిశ శ్శ్రోత్రాత్ తథా లోకాన్ అకల్పయన్ ॥**

నాభినుండి అంతరిక్షం పుట్టింది. శిరస్సునుండి స్వర్గం పుట్టింది. పాదాలనుండి భూమి పుట్టింది. చెవులనుండి దిక్కులు పుట్టాయి. ఆ విధంగా

లోకాలను అన్నిటికిని బ్రహ్మ సృష్టించాడు.

ఇందులో లోకాల సృష్టి తెలుపబడుతున్నది.

**(నాభ్యా....)** దేహం మధ్యలో ఉండే నాభినుండి భూమికి పైనుండే లోకాలకు, మధ్యలో ఉండే అంతరిక్షం పుట్టాయి.

**(శీర్ష్ణః....)** పైన ఉండే శిరస్సునుండి పైన ఉండే ఏడు లోకాలు పుట్టాయి. "ఇక్కడ **"ద్యౌః"** అనే పదం పై ఏడు లోకాలను లక్షిస్తుంది.

**(పద్భ్యాం భూమిః)** - పాదాలనుండి భూమి పుట్టింది. పాదాలనుండి పుట్టినందువల్లనే కదా ఆళ్వార్లు **"పారువిల్ శీర్‌భూమి"** అని కొనియాడారు. దేహాన్ని పాదాలు మోస్తాయి. అందటిని మోసేది కనుక ధరణి అని పేరు భూమి పొందినది. కేశవనంబి శ్రీచరణాలను సంవాహనం చేసే ప్రాప్యాన్ని భూదేవి పొందింది. **"కిడన్దిరున్దు నిన్ఱళన్దు కేழలాయ్ క్కీழ్ పుక్కు ఇడన్దిడుమ్ తన్నుళ్ కరక్కుమ్ ఉమిழుమ్, తడమ్ పెరున్దోళార త్తழువుమ్ పారెన్నుమ్ మడన్దైయై మాల్ శెయ్‌కిన్ఱ మాల్ ఆర్ కాణ్బారే"** (పరుండి, కూర్చుని, నిలచి, కొలిచి, వరాహమై అండభిత్తి కిందకు పోయి ఉద్ధరించి, తనలో అంతర్భవింపజేసి, వెలువరించి, విశాలమైన, గొప్ప బాహువులతో ఆలింగనం చేసికొనే భూమి అనే కాంతపట్ల ప్రేమనుకల ఆశ్రిత వ్యాముగ్ధుని ఎవరు దర్శించగలరు?) అని నమ్మాళ్వార్లు పల్కినట్లుగా సర్వావయవాలతో, విశేషంగా శ్రీచరణాలలో స్పృశింపబడినది కదా, భూదేవి. ఈ కారణాలవల్ల కూడా భూలోకంలో మందబుద్ధులు ఉజ్జీవించడానికి ఉపాయం నారాయణుని శ్రీచరణాలే - అని చూపడంకోసంకూడా భూమి పాదాలనుండి సృష్టింపబడింది - అని గ్రహించాలి.

**(దిశః శ్రోత్రాత్)** - చెవులనుండి దిక్కులు సృష్టింపబడ్డాయి. శబ్దానికి ఆధారమైన దిక్కులు శబ్దాలను వినే ఇంద్రియమైన శ్రోత్రంనుండి సృష్టింపబడ్డాయి.

**(తథా....)** ఆ విధంగానే ఈ బ్రహ్మాండంలో ఉండే మిగిలిన లోకాలను

కూడా పరంధాముని అంతర్యామిగా కల బ్రహ్మ సృష్టించాడు. **"అకల్పయన్"** అనే బహువచనప్రయోగంలో పల్కడం ఛాందసమని గ్రహించాలి. లేక, బ్రహ్మను ఉపకరణంగా కల నిత్యసూరులు సృష్టించారని కూడా చెప్పవచ్చు.

**16. వేదాహమేతం పురుషం మహాంతమ్**
**ఆదిత్యవర్ణం తమసస్తు పారే ।**
**సర్వాణి రూపాణి విచిత్య ధీరః**
**నామాని కృత్వాభివదన్ యదాస్తే ॥**

అన్ని శరీరాలను సృష్టించి, పేర్లను పెట్టి, వాటిని ఉచ్చరిస్తూ ఉండేవాడు, వికారం లేనివాడు, సూర్యునివంటి వర్ణాన్ని కలవాడు, ప్రకృతిమండలానికి ఆవలి వైపున ఉండేవాడు, (అన్ని విధాలుగా) గొప్పవాడైన ఈ పురుషుని (వేదపురుషుడనైన) నేను తెలిసికొంటున్నాను.

**"వేదాహ మితి మంత్రాభ్యాం వైభవం కథితం హరేః" ("వేదాహమ్"** అని ఆరంభమయే రెండు మంత్రాలతో హరియొక్క మహిమ చెప్పబడింది) అని, ఈ మంత్రం, తరువాత మంత్రం హరి యొక్క వైభవాన్ని తెలుపుతున్నవని పురుషసంహితలో చెప్పబడింది. వేదపురుషుడు పరమపురుషుని మహిమను తెలిసి, ఆనందంగా పలికే వచనాలివి. ఈ మంత్రంలోని మొదటి పాదం శ్రీరామాయణంలో **"అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్"** (నేను, సత్యమైన పరాక్రమాన్ని కలవానినిగా, మహాత్మునిగా శ్రీరాముని తెలిసికొంటున్నాను) అనే విశ్వామిత్రవాక్యంతో ఉపబృంహణం చేయబడింది - అని పెరియవాచ్చాన్‌పిళ్ళై పలికారు. పరమకారుణికులైన పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానాన్ని అనుసరించి ఇక్కడ ఈ మంత్రం వ్యాఖ్యానింపబడుతున్నది. శ్రీరామాయణంలో ఉపబృహణం చేయబడినందున ఈ శ్రుతి శ్రీరాముడై అవతరించిన నారాయణునే తెల్పుతున్నదని స్పష్టపడుతున్నది. ఈ మంత్రంలోని పూర్వార్ధం శ్వేతాశ్వతరోపనిషత్తులో కూడా కొంచెం తేడాతో అధ్యయనం చేయబడుతున్నది.

దీనివల్ల, సర్వవేదాంతప్రత్యయన్యాయానుసారం శ్వేతాశ్వేతరోపనిషత్తులో చెప్పబడేవాడు, ఇక్కడ చెప్పబడేవాడు శ్రీమన్నారాయణుడే - అని సిద్ధిస్తున్నది. అక్కడ వ్యాఖ్యానం చేసిన శ్రీరంగరామానుజమునులు కూడా - **"ప్రకృతేః పరస్తాత్ జ్యోతిః మహాపురుసం తమేవ నారాయణం విదిత్వా మృత్యుశబ్దితం సంసార మతిక్రామతి"** (ప్రకృతి ఆవల ఉండేవాడు, జ్యోతిర్మయుడు, మహాపురుషుడైన నారాయణుని తెలిసికొని, మృత్యుశబ్దంచేత చెప్పబడే సంసారాన్ని దాటుతున్నాడు) అని వివరించారు.

**(అహం వేద)** నేను తెలిసికొంటున్నాను. ఇక్కడ **"నేను"** అని అనేవాడు వేదపురుషుడు. పరమాత్మను తెలిసినందున, ఇతరులకు తెలియజేస్తున్నందున వేదమనే పేరును, కీర్తిని పొందిన నేను తెలిసికొంటున్నాను. నిత్యుడనైన నేను తెలిసికొంటున్నాను. అపౌరుషేయుడనైన నేను తెలిసికొంటున్నాను. **"న చక్షుషా గృహ్యతే"** (పరమాత్మ కంటికి కన్పించనివాడు) అని, **"మనసా తు విశుద్ధేన"** (శుద్ధమైన మనస్సుతో తెలియదగినవాడు) అని, **"ఎన్జ్రేనుమ్ కట్కణ్ణాల్ కాణాద అవ్వురువై నెఞ్జెన్నుమ్ ఉట్కణ్ణాల్ కాణు ముణర్న్దు"** (ఏనాటికీ బాహ్యనేత్రంతో దర్శించలేని ఆ పరమాత్మ రూపాన్ని మనస్సు అనే ఆంతరనేత్రంతో దర్శించి తెలిసికొంటున్నాడు) అని చెప్పబడే రీతిలో వేదపురుషుడు తన జ్ఞాననేత్రంతో దర్శించి పల్కుతున్నాడు. **"నేతి నేతి"** (పరమాత్మ ఇటువంటివాడు కాడు, ఇటువంటివాడెవడూ లేడు) అని, **"క ఇత్థా వేద యత్ర సః"** (పరమాత్మ ఇటువంటివాడు అని ఎవరు తెలియగలరు?) అని ప్రమాణభూతమైన వేదంలో కూడా పరమాత్మ తెలియసాధ్యం కానివాడని కీర్తింపబడ్డాడు. **"బ్రహ్మరుద్రేంద్రభూతానాం మనసామప్యగోచరమ్"** (బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు - అనే వీరి మనస్సుకు కూడా అందనివాడు) అని, **"నాన్ముకన్ శెఞ్జడైయాన్ ఎన్డివర్కళ్ ఎమ్బెరుమాన్తన్మైయై యారఱికిఱ్పార్?"** (చతుర్ముఖుడు, ఎఱ్ఱని జటలను కల శివుడు - అనే వీరి భగవంతుని స్వభావాన్ని ఏవిధంగా తెలియగలరు?) అని ప్రమాతలుగా (తెలుసుకునేవారుగా) చెప్పబడే బ్రహ్మరుద్రేంద్రులచే కూడా అచ్యుతుని తెలియడం సాధ్యం కాదని

చెప్పబడింది. పరిమితమైన జ్ఞానాన్ని కల బ్రహ్మరుద్రాదులు తెలియలేకపోవడం న్యాయమే. **"య స్సర్వజ్ఞ స్సర్వవిత్"**, (ఎవడు అన్నీ తెలిసినవాడో, అన్నిటిని పొందేవాడో), **"స్వాభావికీ జ్ఞానబలక్రియా చ"** (స్వాభావికాలైన జ్ఞానం, బలం, క్రియలను కలవాడు, భగవంతుడు) అనే ప్రమాణాలను నమ్మి, సార్వజ్ఞ్యాన్ని అభిమానించి, ఏ ఆచార్యునివద్ద శ్రవణం చేయనందున అతడు (భగవంతుడు) కూడా తన స్వభావాన్ని తెలియలేడు. అయితే, వేదం తెలిపిన రీతి ఏమి? అంటే,

**(మహాంతమ్)** - అపరిచ్ఛేద్యుడనియే గ్రహించింది. **"అఱిన్దన వేద వరుమ్ పొరుళ్నూల్కళ్ అఱిన్దన కొళ్క అరుమ్బెరుళాదల్"** అని, **"యస్యా మతం తస్య మతమ్"** (ఎవనికి పరమపురుషుడు అపరిచ్ఛేద్యుడని తెలిసినదో, అతడే ఆ భగవంతుని తెలిసినవాడు) అని చెప్పినట్లుగా ఇదమిత్థంగా పరిచ్ఛేదించి గ్రహించడానికి సాధ్యం కానివాడని తెలియడమే యథార్థంగా తెలియడం. **"వేదాహమ్"** అనేది శ్రీరామాయణంలో **""అహం వేద్మి"** అనేది వివరిస్తున్నది. ఇక్కడ **"వేద"** అనేది అక్కడ **"వేద్మి"** అని, ఇక్కడ **"అహమ్"** అనేది అక్కడ **"అహమ్"** అని చెప్పబడ్డాయి.

**(ఏతమ్ వేద)** - ఈ విధంగా ప్రసిద్ధుడైనవానిని తెలిసికొంటున్నాను. సర్వకారణ భూతుడై ఉన్నా, మానవులకోసం పడరాని పాట్లు పడి, **"ఎన్నిన్ఱ యోనియుమాయ్ పిఱన్దాయ్"** (ఎన్నెన్ని జాతులలో పుట్టావో) అనే విధంగా ఎన్ని జాతులలోనో పుట్టినవానినిగా ఇతనిని తెలిసికొంటున్నాను - అని అర్థం. అవతారసౌలభ్యాన్ని ఈ పదం చూపుతున్నది. ఇక్కడ **"ఏతమ్"** అనే దానిని శ్రీరామాయణంలోని **"రామమ్"** అనే అవతార నిర్దేశం చేస్తున్నది.

**(పురుషమ్)** - అతడొక్కడే పురుషుడు - అనదగినవాడు. మిగిలినవారు స్త్రీప్రాయులే. సకల కల్యాణగుణాలతోను పూర్ణమైన వాడు పురుషుడు. ఇక్కడ చెప్పబడే శౌర్యవీర్యాది పరాక్రమాదిగుణాలు శ్రీరామాయణంలోని **"సత్యపరాక్రమమ్"** అనే పదంతో సూచింపబడ్డాయి. **"పురి- శేతే"** అనే

వ్యుత్పత్తినిబట్టి వైకుంఠంలో ఆదిశేషునిపై వేంచేసి ఉండే పురుషుడని కూడా అర్థాన్ని గ్రహించవచ్చు.

**(ఏతం పురుషమ్)** - **"అంగుష్ఠమాత్రః పురుషోంతరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః"** (బొటనవేలు పరిమాణాన్ని కల్గినవాడు, అంతర్యామి అయిన పురుషుడు ఎల్లప్పుడు జనుల హృదయంలో వేంచేసి ఉంటాడు) అనే రీతిలో జనులందరి హృదయాలలో నివసించేవాడు పురుషుడు - అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. దేశాంతరంలో ఎక్కడో ఉండకుండా దగ్గరలో అంతర్యామిగా ఉన్నదున "ఈ పురుషుని" అని **"ఏతం పురుషమ్"** అని చెప్పబడుతున్నాడు. "అతడు పరతత్త్వంకదా!" అని మనం భయపడనక్కరలేదు. ఏవగించుకోదగిన దోషాలకు వీరు అద్వితీయజన్మస్థానం కదా! - అని అతడు తొలగి దూరంగా వెళ్ళిపోడు. అతనివద్దకు వెళ్ళి మనం మొఱపెట్టే (ప్రార్థించే) సమయంలో వెంటనే ఎదుటకు వచ్చి నిలువడానికి వీలుగా చాలా దగ్గరలోనే ఉన్నవాడు.

**(మహాంతమ్)** - దీనిని అనుసరించి శ్రీరామాయణంలో **"మహాత్మానమ్"** అనబడింది. ఇతడు చాలా గొప్పవాడని తెలిసికొంటున్నాడు. **"స ఉ శ్రేయాన్ భవతి జాయమానః"** (ఆ పురుషోత్తముడు జన్మించిన పిమ్మటనే గొప్పవాడవుతున్నాడు) అని తక్కువవారికి కూడా తన దర్శనాన్ని అనుగ్రహించడంకోసం పలు అవతారాలు ఎత్తిన తరువాత అతడు చాలా గొప్పవాడని తెలిసికొన్నాను. అన్ని రీతులలో పరమపురుషుడు గొప్పవాడు.

**(మహాంతమ్)**- స్వరూపంలో గొప్పవాడు ఇతడొకడే - అంతటా వ్యాపించి ఉండేవాడు.

**(మహాంతమ్)** - గుణాలతో గొప్పవాడు. అంతు లేని కల్యాణగుణాలను కలవాడు. ఒక్కొక్క గుణం అపరిచ్ఛేద్యమైనది. ఒక్క ఆనందగుణాన్ని మాత్రం పరిచ్ఛేదించి చూడాలని ప్రయత్నించిన వేదం **"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"** (వేదాలు భగవంతుని గొప్పతనాన్ని తెలియలేక మనస్సుతో పాటు వెనుదిరుగుతున్నది) అని ప్రయత్నాన్ని విరమించి

వెనుదిరిగి వెళ్ళిపోయింది కదా! **"ఎల్లైయిల్ ఞానత్తన్"** (అంతులేని జ్ఞానం కలవాడు) అని ఆళ్వార్లు పల్కిన రీతిలో అంతు లేని జ్ఞానాన్ని కలవాడు. బలంలో గొప్పవాడు. ఐశ్వర్యంలో గొప్పవాడు. వీర్యంలో గొప్పవాడు. శక్తిలో గొప్పవాడు. తేజస్సులో గొప్పవాడు. ఇతరుల దుఃఖాన్ని చూచి "అయ్యో!" అని జాలిపడే దయలో గొప్పవాడు. భక్తుల దోషాలను తెలియనివాడు. తన భక్తుల దోషాలను గుణాలుగా గ్రహించే రీతిలోని వాత్సల్యగుణాన్ని కలవాడు. **"శెయ్‌దారేల్ నన్రు శెయ్‌దార్"** (చేస్తే మంచినే చేస్తాడు) అని కదా భగవంతుని సూక్తి. **"అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ"** (నన్ను శరణు పొందినవారికి అన్ని ప్రాణులవల్ల అభయాన్ని కల్గిస్తాను. ఇదే నా వ్రతం) అని పల్కి, ఆపదలలో చిక్కుకొన్నవారిని "భయపడకు" అని దయ చూపే చాలా అరుదైన గొప్ప స్వభావాన్ని కలవాడు. గొప్ప విరోధులను కూడా చిన్న కీటకాన్ని నలిపివేసినట్లుగా నలిపివేయగల పరాక్రమాన్ని కలవాడు. "జయించగలడా? లేక, ఓడిపోతాడా?" అనే సందేహం ఇతని పరాక్రమవిషయంలో కలుగదు. **"నావిజిత్య నివర్తతే"** (జయించకుండా తిరిగిరాడు) అని, **"శెన్రు కొన్రు వెన్రికొణ్డ"** (శత్రువు వద్దకు పోయి అతనిని వధించి, జయించిన) అని పలికే రీతిలో యుద్ధానికి బయలుదేరితే గొప్ప ప్రత్యర్థులను కూడా పరాజితులను చేసి వారి తలను త్రుంచితే గాని తిరిగి వచ్చేవాడు కాడు.

**(మహాంతమ్)** - గొప్పతనాన్ని కల శరీరాన్ని కలవాడు. **"మాశూణా చ్చుడరుడమ్బాయ్"** (ఏదోషం లేని జ్యోతిర్మయ శరీరమై) అని, **"తస్య ప్రాకృతా మూర్తిః మాంసమేదోస్థిసంభవా"** (ఆ మహాపురుషుని శరీరం మాంసంతో, కొవ్వుతో, ఎముకలతో నిర్మింపబడిన ప్రాకృత శరీరం కాదు) అని, **"నిత్యం నిత్యాకృతిధరమ్"** (నిత్యమైనవాడు, నిత్యమైన దివ్యమంగళవిగ్రహాన్ని కలవాడు) అని చెప్పబడిన నిత్యనిరతిశయ ఔజ్జ్వల్యాన్ని కల (ఏనాడు ఏ దోషాన్ని లేనిది, సాటి లేని కాంతిని కల్గినదైన) శరీరాన్ని కలవాడు. అన్ని బ్రహ్మాండాలలో ఉండే సకలచేతనాచేతనాలను శరీరంగా కలవాడైనందున గొప్ప శరీరాన్ని కలవాడని కూడా అర్థాన్ని గ్రహించవచ్చు.

**(మహాంతమ్)** - పరమాత్మయై ఉండేవాడు. **"యస్మాత్ పరం నాపర మస్తి కించిత్"** (ఎవని కంటే గొప్ప వస్తువు వేఱొకటి లేదో) అని, **"న తత్ సమ శ్చాభ్యధికశ్చ దృశ్యతే"** (అతనికి సమానుడు గాని, మించినవాడుగాని ఇంకొకడు కన్పించడం లేదు) అని **"తమీశ్వరాణాం పరమం మహేశ్వరం, తం దేవతానాం పరమం చ దైవతమ్"** (ఈశ్వరులకు గొప్ప ఈశ్వరుడు, దేవతలలో గొప్ప దేవత అయిన అతనిని) అని, **"ఒత్తార్ మిక్కారై యిలై యాయ మామాయా"** (సాటివచ్చేవారు, మించినవారు ఎవరూ లేని వాడు. గొప్పవైన ఆశ్చర్యకరమైన లీలలను కలవాడు) అని పలకేటట్లు దేవాధిదేవుడై ఆదిమూలమై, అంతర్యామియై ఉండేవాడు.

**(ఆదిత్యవర్ణమ్)** - సూర్యుని కాంతివంటి కాంతిని కలవాడు. కోటి సూర్యుల ప్రకాశాన్ని కల పరంజ్యోతికి అల్పప్రకాశాన్ని కల ఆదిత్యుని ఉపమానంగా చెప్పవచ్చునా? అంటే, మనం కళ్ళతో చూచే జ్యోతిస్సులలో సూర్యుడే చాలా గొప్ప జ్యోతిస్సుగా కన్పిస్తున్నందున, ఇక్కడ అతడే ఉపమానంగా చెప్పబడ్డాడు. **"స ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే"** (సూర్యునకు మధ్యలో బంగారంవంటి కాంతిని కల పురుషుడు గోచరిస్తున్నాడు) అని పరమపురుషుడు వర్ణింపబడ్డాడు కదా! ఆ మహాపురుషునే "సవితు ర్వరేణ్యమ్'' అని గాయత్రిలో అనుసంధిస్తున్నాము. "మలర్‌కతిరిన్ శుడరుడమ్బాయ్" (వికసించే కిరణాలను కల, జ్యోతిస్స్వరూపుడై) అని ఆళ్వార్లు కూడా పలికారు. వేదాలు, వైదికపురుషులు ఇతనిని గూర్చి పల్కడం ఆరంభిస్తే సూర్యునితో సాటి వచ్చే కాంతిని కలవాడు - అనియే స్తుతిస్తారు.

**(తమసస్తు పారే)** - తమస్సుకు ఆవలి వైపున ఉండేవాడు. **"తమసః పరమో ధాతా శంఖచక్రగదాధరః"** (మూలప్రకృతికి- రజస్తమస్సులకు దూరంగా ఉండేవాడు జగత్సృష్టికర్త, శంఖచక్రగదలను ధరించినవాడు) అని మండోదరిచే చెప్పబడిన చక్రపాణియే ఇతడు. **"తమః"** అనే శబ్దం మూలప్రకృతిని సూచిస్తుంది. **"సోధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్"** (అతడు

సంసారానికి ఆవలివైపు తీరాన్ని చేరుతున్నాడు. అదియే విష్ణువుయొక్క పరమపదం) అని కఠోపనిషత్తులో చెప్పబడినది. ఇక్కడ చెప్పబడినదికూడా విష్ణువుయొక్క పరమపదమే- అని నిస్సందేహంగా నిశ్చయింప బడుతున్నది.

**(సర్వాణి.....)** జీవులు **"లూనపక్ష ఇవాండజః"** అని ఱెక్కలు తెగిన పక్షివలె అచిత్సములై, కరణకళేబరాలను లేనివారై, భోగమోక్షాలను లేనివారై ఉండే చాలా దీనమైన స్థితిని చూచి, దయను పొందిన మనస్సు కలవాడై, వారు తనను పొందడంకోసం శరీరాలను ఇచ్చి, నామరూపాలను ఏర్పరిచాడు.

**(సర్వాణి రూపాణి విచిత్య)** - దేవతలు, మనుష్యులు, తిర్యక్కులు, స్థావరాలు - అనబడే చతుర్విధ శరీరాలను ఏర్పరచి,

**(నామాని కృత్వా)** - వాటికి నామాలను ఏర్పరచి, వాటిని ఉచ్చరిస్తూ ఏ పరమాత్మ ఉన్నాడో, అతనిని తెలిసికొంటున్నాను. **"అనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి"** (వీని లోపల ప్రవేశించి, నామరూపాలను వ్యాకరిస్తున్నాను) అని పరమపురుషుడు సంకల్పించాడని చెప్పబడింది కదా!

**(ధీరః)** - ఈ విధంగా వీటిని వ్యాపించి, వీటి నామరూపాలను ఇచ్చినప్పటికీ, వీటి లోని వికారాలు ఏమీ తనకు సోకని రీతిలో ఉన్నందున పురుషోత్తముడు **"ధీరః"** అని చెప్పబడుతున్నాడు. బుద్ధిని రమింపజేసే వాడనే అర్థాన్ని కూడా ఈ పదానికి గ్రహించవచ్చు. **"యత్"** అనే చోట నపుంసకలింగం ఛాందసం (వైదికప్రయోగం).

దీనివల్ల, యథార్థతత్త్వమైన వేదం ఒకటిగా కలసి ఉన్నదని తెలుస్తున్నది. **"పురుషమ్"** అనేదానివల్ల పరమాత్మకు గుణాలున్నాయని ఏర్పడుతున్నది. **"మహాంతమ్"** అని అన్నందున అతనికంటే తక్కువ వారున్నారని తెలుపబడుతున్నది. **"ఆదిత్యవర్ణమ్"** అనే దానివల్ల అసాధారణమైన దివ్యమంగళవిగ్రహాన్ని కలవాడు - అని తెలుపబడింది. **"తమసస్తు పారే"** అని అన్నందున అప్రాకృతదివ్యదేశంలో అతడు ప్రకాశిస్తున్నాడు - అని తెలుస్తున్నది. అనేక చేతనులు వాస్తవంగా ఉన్నారని, వారికి నామరూపాలకు ఇచ్చాడని కూడా

తెలుస్తున్నది. వీటిని అంగీకరిస్తే అద్వైతం అనేది లేకుండా పోతుంది - అనే భయంతో వేదం వాస్తవం కాదని, పురుషోత్తమునకు రూపం లేదు, గుణాలు లేవు, స్థానం లేదు - అని, చేతనాచేతనాలు వాస్తవానికి లేవని, మాయవల్ల ఏర్పడే ఆభాసమే - అని పలికే మాయావాదుల మతం పూర్తిగా ఇక్కడ నిరాకరింప బడినట్లయినది.

**17. ధాతా పురస్తా ద్యముదాజహార**
**శక్రః ప్రవిద్వాన్ ప్రదిశ శ్చతస్రః ।**
**తమేవం విద్వా నమృత ఇహ భవతి**
**నాన్యః పంథా అయనాయ విద్యతే ॥**

(ఎవరిని బ్రహ్మదేవుడు పూర్వం ధ్యానించాడో, పరమాత్మ యొక్క జ్ఞానాన్ని కల ఇంద్రుడు ఎవరిని ఉపాసించాడో, ఎనిమిది దిక్పాలకులు (ఋషులు) ఎవరిని ధ్యానించారో, ఆ పరమపురుషుని ఈ విధంగా తెలిసినవాడు ఈ జన్మలోనే ముక్తిని పొందుతున్నాడు. మోక్షానికి ఇంకొక దారిలేదు)

వేదపురుషుడు తానేకాక, ఇంకా మఱి కొందఱుకూడా ఈ మహాపురుషుని తెలిసికొన్నారని వ్యక్తం చేసి, ఆ మహాపురుషుని ఈ విధంగా తెలియడమే మోక్షోపాయం, వేఱు దారి లేదని నిర్ణయిస్తున్నారు.

**(ధాతా....)** మొదట సృష్టింపబడిన బ్రహ్మ మహాపురుషుని ధ్యానించాడు - అని చెప్పబడుతున్నది. సృష్టికి ముందు సృష్టిని చేసే దారి తెలియని చతుర్ముఖుడు భగవంతుని ఉద్దేశించి ధ్యానం చేశాడని దీనివల్ల తెలుస్తున్నది. **"యుగకోటిసహస్రాణి విష్ణుమారాధ్య పద్మభూః, పున స్త్రైలోక్యధాతృత్వం ప్రాప్తవానితి శుశ్రుమః"** (బ్రహ్మ వేలకోట్ల యుగాలు విష్ణువును ఆరాధించి, మళ్ళీ తిరిగి తరువాత కల్పంలో కూడా బ్రహ్మపదవిని పొందాడని వింటున్నాము) అని చెప్పబడినట్లు తన పదవికోసం గడచిన కల్పంలో బ్రహ్మ

పురుషోత్తముని ధ్యానించాడనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు.

**(శక్రః....)** - నూఱు అశ్వమేధయాగాలు చేసి భగవంతుని ఆరాధించి, ఇంద్రపదవిని ఇంద్రుడు పొందాడు. తరువాత మన్వంతరంలో ఇంద్రపదవిని పొందబోతాడు. మహాబలి కూడా ఈ విధంగానే భగవంతుని ఉపాసించాడు.

**(ప్రదిశః...)** - **"చతస్రః"** అని తూర్పు మొదలైన నాల్గు దిక్కులు, "ప్రదిశః" అని ఆగ్నేయాది నాల్గు మూలలు (విదిశలు) చెప్పబడ్డాయి కదా. ఈ ఎనిమిది దిక్కులకు పాలకులు, ఈ దిక్కులలో ఉండే ఋషులు ఈపదాల ద్వారా తెలుపబడుతున్నారు. వారు కూడా ఈ పురుషోత్తముని ఉపాసిస్తున్నారని తెలుస్తున్నది. ఈశాన్యదిక్కుకు అధిపతి, అక్కడ నివసించేవాడైన శివుడు ఈ పరమపురుషుని ఉపాసిస్తున్నాడని తెలుస్తున్నది. నమ్మాḻ్వార్లు ఈ విషయాన్నే **"కళ్వా! ఎమ్మైయుమ్ ఏḻులకుమ్ నిన్ ఉళ్ళే తోఁద్రియ ఇఱైవ! ఎన్ఱు, వెళ్ళేఱన్ నాన్ముకన్ ఇన్దిరన్ వానవర్ పుళ్ళూర్ది కḻల్ పణిన్దేత్తువరే"** (వంచనశీలా! మమ్ములను, ఏడు లోకాలను నీలో ఆవిర్భవింప జేసిన స్వామీ! - అని తెల్లని ఎద్దును అధిరోహించే శివుడు, చతుర్ముఖుడు - గరుడవాహనుని సేవించి, కీర్తిస్తారు) అని అన్నారు. అత్రి, భృగువు, కశ్యపుడు, కర్దముడు, దక్షుడు, వశిష్ఠుడు, నారదుడు, వాల్మీకి, పరాశరుడు, వ్యాసుడు, శుకుడు, శౌనకుడు, యాజ్ఞ్యవల్క్యుడు మొదలైన ఋషులు ఈ హృషీకేశునే కీర్తిస్తున్నారని చెప్పబడుతున్నది.

**(తమ్)** - ఇటువంటి, ప్రసిద్ధమైన, పరమాత్మ అయిన నారాయణుని,

**(ఏవం విద్వాన్)** - ఈ విధంగా తెలిసినవాడు - అని అర్థం. సర్వకారణభూతుడని, సర్వరక్షకుడని, సమస్తకల్యాణగుణాత్ముడని, శ్రీవైకుంఠవాసుడని, అసాధారణ దివ్యమంగళవిగ్రహుడని, చేతనులకు నామరూపాలను, కరణకళేబరాలను ఇచ్చేవాడని, బ్రహ్మరుద్రేంద్రాదులచే పూజింపబడేవాడని తెలిసినవాడు - అని భావం. ఇక్కడ జ్ఞానమనేది ధ్యానరూపమైన జ్ఞానాన్ని తెల్పుతుంది.

**(అమృత....)** - ఈ జన్మలోనే జన్మమరణాలనే సంసారాన్ని దాటుతున్నాడు. ప్రారబ్ధకర్మ ఏ జన్మలో తీరుతుందో, ఆ జన్మలోనే మోక్షం కల్గుతుంది - అని శాస్త్రార్థమై ఉండగా "ఈ జన్మలోనే మోక్షం కల్గుతుందనడం ఏ విధంగా? అని అంటే, **"ఏతం పురుషమ్"** అని అవతారాన్ని నిర్దేశించి చూపుతున్నందున, అవతారరహస్యజ్ఞానంతో కూడిన భక్తితో ఈ జన్మలోనే మోక్షం పొందుతాడనేది **"పునర్జన్మ నైతి"** (పునర్జన్మను పొందడు) ఇత్యాది ప్రమాణాలవల్ల తెలుపబడుతున్నందున, ఏ విరోధం లేదు. ఈ లోకంలోనే ముక్తునితో సమానుడవుతున్నాడు- అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. నమ్మాళ్వార్లు కూడా **"పిడిత్తేన్ పిఱవి కెడుత్తేన్ పిణి శారేన్"** (భగవచ్చరణాలను ఆశ్రయించాను. జన్మను పోగొట్టుకొన్నాను. జరామరణాలను ఇక పొందను) అని పరంధాముని పాదాలను ఆశ్రయించగానే జన్మమరణాది సకల దుఃఖాలు తీరుతాయని కదా పలికారు. నారాయణుని పాదాలను ఆశ్రయించి, పల్లాండు పాడి, ఆనందసాగరంలో మునిగి, **"అచ్చువై పెఱినుమ్ వేణ్డేన్"** (ఆ పరమపదానుభవాన్ని పొందినా దానిని కోరను) అని పలికేవారిని ముక్తులు అని అనడంలో అడ్డు లేదు. వారు **"కలిత్తన్నై క్కడక్క పాయ్న్దు"** (కలిని శీఘ్రంగా దాటి) అని అనదగినవారే.

**(నాన్యః....)** - మోక్షాన్ని పొందడానికి వేఱొక ఉపాయం ఏదీ లేదు. **"అయనాయ"** అనేచోట పరమపదాన్ని పొందడానికి - అని శ్వేతాశ్వతరోపనిషత్ భాష్యంలో శంకరులు వ్యాఖ్యానించారు. ఇక్కడ **"నాయ మాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన, య మేవైష వృణుతే న లభ్యః తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్"** (ఈ పరమాత్మను భక్తి లేని కేవల శ్రవణ-మనన-ధ్యానాలతో పొందడం సాధ్యం కాదు. ఎవనిని ఈ పరమపురుషుడు వరిస్తాడో, అతనికే తన స్వరూపాన్ని ఆవిష్కరిస్తాడు) అని, **"న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేన ఏకేన అమృతత్వ మానశుః"** (కర్మలవల్ల గాని, సంతానంవల్ల గాని, ధనంవల్ల గాని మోక్షాన్ని పొందడం వీలు కాదు. న్యాసవిద్యవల్లనే పలువురు మోక్షాన్ని పొందారు) అనే శ్రుతి వాక్యాలు

అనుసంధేయాలు. గీతాచార్యుడు కూడా - **"నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా, శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా, భక్త్యా త్వనన్యయా శక్యః అహ మేవంవిధోర్జున!"** (అర్జునా! నాపట్ల భక్తి లేని వేదాధ్యయనం వల్లగాని, తపస్సువల్లగాని, దానం వల్లగాని, యాగంవల్లగాని, నీవు నన్ను దర్శించినట్లు, నేను దర్శింప సాధ్యమైనవాడను కాను. అనన్య ప్రయోజనమైన భక్తివల్లనే దర్శింపదగినవాడను) - అని అన్నాడు కదా!

ఈ మంత్రంలో, బ్రహ్మ, ఇంద్రుడు, మొదలైన పలువురు పరమాత్మను ఉపాసించినట్లు చెప్పబడిన దానినిబట్టి జీవాత్మలు పలువురున్నారని సిద్ధిస్తున్నది. **"తమ్ ఏవంవిద్వాన్"** (అతనిని ఈవిధంగా తెలిసినవాడు) అనే దానిని బట్టి తెలియబడేవాడు, జ్ఞానం, తెలిసేవాడు- అనే మూడు ఉన్నాయని తెలుపబడుతున్నది. **"ఏవమ్"** అనే దానినిబట్టి పైన చెప్పిన రీతిలో సమస్తకల్యాణగుణ సంపన్నుడని, విగ్రహవిభూతి విశిష్టుడని తెలియాలని ఏర్పడుతున్నది. విగ్రహం లేదు, విభూతి లేదు, గుణం లేదు - అనేవారిని నిరాకరించే రీతిలో ఈమంత్రం ఉన్నది. **"ఏవం విద్వాన్"** అనే దానిని గీతాచార్యుడు **"ఏవంవిధో ద్రష్టుమ్"** (ఈవిధంగా చూడడానికి) అని, **"భక్త్యా"** అని వివరించినందున ఇక్కడ చెప్పబడే జ్ఞానం దర్శించడంతో సమానమైన భక్తియే - అని ఏర్పడుతున్నది. అందువల్ల వాక్యార్థజ్ఞానంతో మోక్షం పొందడం సాధ్యం కాదని సిద్ధిస్తున్నది. **"అమృతో భవతి"** అనే దానినిబట్టి "సంసారి, ముక్తుడు'' - అనే భేదం ఉన్నదని తెలుపబడుతున్నది.

**18.** **యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాః**
**తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ ।**
**తే హ నాకం మహిమాన స్సచంతే**
**యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః ॥**

(నిత్యసూరులు బ్రహ్మను ఉపకరణంగా గ్రహించి, సృష్టిరూపమైన

యజ్ఞాన్ని చేశారు. ఆ యజ్ఞం మొదలైన ధర్మాలు ముఖ్యాలు అయినవి. ఈ విధంగా తెలిసేవారు మహిమను కలవారై, ప్రాచీనులైన నిత్యసూరులు వాసం చేసే పరమపదాన్ని పొందుతున్నారు.)

ఈ మంత్రంలోని పూర్వార్ధంలో ఈ అనువాకంలో చెప్పబడిన సృష్టిప్రకారం, ఉత్తరార్ధంలో **"వేదాహమ్"** ఇత్యాది రెండు మంత్రాలలో చెప్పబడిన భగవదుపాసనం, దాని ఫలం చెప్పబడ్డాయని విద్యారణ్యులు అన్నారు. **"నారాయణమ్"** అని ప్రసిద్ధమైన పురుషసూక్తంలోని పూర్వానువాకం ఈ ఋక్కుతో ముగుస్తున్నది.

**(యజ్ఞేన...)** - యజ్ఞానికి ముఖ్యసాధమైన బ్రహ్మను గొని నిత్యసూరులు సృష్టిరూపమైన యజ్ఞాన్ని చేశారు.

**(తాని....)** - అది మొదలుకొని ఆ యజ్ఞం, దానం మొదలైన ధర్మాలు ముఖ్యమైనవిగా అయినవి. ధర్మార్థకామమోక్షానబడే నాల్గు పురుషార్థాలకు సాధనమై ఉన్నాయి. గీతలో **"సహ యజ్ఞైః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః , అనేన ప్రసవిష్యధ్వం ఏష వోఽస్త్విష్టకామధుక్"** (యజ్ఞాలతో కూడ ప్రజలను పూర్వం సృష్టించి, భగవంతుడు ఈ విధంగా అన్నాడు - ఈ యజ్ఞంతో వృద్ధిని పొందండి. ఇది మీకు కోరినదానిని అంతటిని ఇస్తుంది) అని పల్కినది ఇక్కడ అనుసంధేయం.

**(తే హ....)** ఈ సృష్టిరూపమైన యజ్ఞాన్ని తెలిసికొని, అర్థంతో అనుసంధించేవారు, సనాతనులైన, సాధ్యులనే పేరును కల్గిన నిత్యసూరులు నివసించే వైకుంఠాన్ని మహిమను కలవారై పొందుతారు.

**(నాకమ్)** - **"నాకస్య పృష్ఠే"** అని నారాయణవల్లిలో చెప్పబడిన వైకుంఠమే ఇక్కడ చెప్పబడుతున్నది.

**(మహిమానః)** - జ్ఞానసంకోచం లేనివారుగా అనంతగరుడ విష్వక్సేనాదులు ఉండే పరమపదాన్ని పొందుతారు. **"ఒళిక్కొణ్డ శోదియుమాయ్

**ఉడన్ కూడువదు ఎన్నుకొలో!.... అళిక్కిన్ఱ మాయప్పిరాన్ అడియార్కళ్ కుఴాఙ్గళైయే”** (లోకాలను రక్షించే ఆశ్చర్యచేష్టితుడైన స్వామి యొక్క భక్తబృందాన్ని జ్యోతిర్మయ రూపాన్ని కలవాడనై కలవడం ఎపుడో కదా!) అని ఆఴ్వార్లచే ప్రార్థింపబడిన ఫలాన్ని పొందగలరు. దీనివల్ల, సాధ్యదేవులని కొందఱున్నారని, వారుండే చోటును పొందడమే మోక్షమని తెలుస్తున్నది. (సాధ్యులంటే ప్రాప్యులు).

# ఉత్తరానువాకమ్

1. అద్భ్యః సంభూతః పృథివ్యై రసాచ్చ
 విశ్వకర్మణః సమవర్తతాధి ।
 తస్య త్వష్టా విదధద్రూపమేతి
 తత్పురుషస్య విశ్వమాజాన మగ్రే ॥

లోకం జలంనుండి పుట్టింది. భూమిలో ఉండే అన్నరసంతో వృద్ధిని పొందుతున్నది. పరమపురుషునివద్దనుండి ఇవి పుట్టాయి. పురుషోత్తముడు దానిని ధరిస్తూ వ్యాపిస్తున్నాడు. అందువల్ల ఈ లోకం అంతా పరమపురుషునకు శేషమై ఉన్నదని పూర్వమే తెలిసికొన్నాను.

**(అద్భ్యః సంభూతః)** - లోకం నీటినుండి పుట్టింది - అని అర్థం. మహోపనిషత్తులో - **"అథ పునరేవ నారాయణః స్సోన్యం కామం మనసా ధ్యాయీత, తస్య ధ్యానాంతస్థస్య లలాటాత్ స్వేదోపతత్, తా ఇమా ఆపతత్, హిరణ్యమండ మభవత్"** (తరువాత, నారాయణుడు వేఱొక సంకల్పాన్ని మనస్సులో చేశాడు. సంకల్పం చేయగానే అతని ఫాలంనుండి చెమట జారిపడింది. అదే ఇక్కడ కన్పించే నీరు. అందులో హిరణ్యమయమైన అండం పుట్టింది) అని చెప్పబడడం ఇక్కడ తెలియదగినది. ఇదే **"అప ఏవ ససర్జాదౌ.... తదండ మభవత్ హైమమ్"** (నారాయణుడు జలాన్ని మొదట సృష్టించాడు. దానినుండి బంగారురంగులోని అండం పుట్టింది) అని మనుస్మృతిలో కూడా చెప్పబడింది. ఆ*ళ్వా*ర్లు కూడా **"తానోర్ పెరు నీర్ తన్నుళ్ళే తో*ర్ ఱి*"** (తాను అద్వితీయమైన గొప్పజలాన్ని తనలో సృష్టించి) అని అన్నారు.

**(పృథివ్యై రసాచ్చ సంభూతః)** భూమినుండి పుట్టిన అన్నరసాలతో వృద్ధి పొందింది.

**(విశ్వకర్మణః)** - పరమాత్మవద్దనుండి ఇవి పుట్టాయి. జలంనుండి,

భూమినుండి తానుగానే స్వయంగా పుట్ట లేదు - అని తెలియజేయడం కోసం లోకాన్ని సృష్టించిన ఉత్తమునిచే కర్మానుగుణంగా హెచ్చు తగ్గులతో సృష్టింపబడ్డాయని చెప్పబడుతున్నది. మహోపనిషత్తును అనుసరించి ఇక్కడ చెప్పబడే **"విశ్వకర్మా"** మొదలైన శబ్దాలు నారాయణునే నిర్దేశిస్తున్నాయని గ్రహించగలం. **"ధాతా నారాయణః"** అని కదా సుబాలోపనిషత్తులో ఈ మహాపురుషుడు కీర్తింపబడ్డాడు.

**(తత్పురుషస్య విశ్వమ్)** - అందువల్ల ఈ విశ్వం ఆ పురుషునిదే. లోకం సొత్తు. సొత్తుదారుడు ఆ పురుషోత్తముడు. **"కృష్ణస్య హి కృతే భూత మిదం విశ్వం చరాచరమ్"** (ఈ చరాచర రూపమైన విశ్వం అంతా శ్రీకృష్ణునిదే కదా) అనే స్మృతివచనం ఈశ్రుతిని వివరిస్తున్నది.

**(ఆజాన మగ్రే...)** - ఈ లోకం భగవానునకు శేషమని నేను పూర్వమే గ్రహించాను - అని వేదపురుషుడు ప్రకటిస్తున్నాడు. భగవంతుడు లోకాన్ని సృష్టించి, ధరించి, వ్యాపించినట్లుగా చెప్పబడినందున విశిష్టాద్వైత వేదాంతమే వేదాంత సారార్థం అనేది ఇక్కడ చక్కగా వ్యక్తమవుతున్నది.

**2. వేదాహ మేతం పురుషం మహాంతమ్**
**ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ ।**
**తమేవం విద్వా నమృత ఇహ భవతి**
**నాన్య పంథా విద్యతేయనాయ ॥**

బ్రహ్మాండాలకు అధిపతియై, అండకులానికి ఆవైపున ఉండే శుద్ధసత్త్వమయమైన శ్రీవైకుంఠంలో కోటిసూర్యప్రకాశంతో వేంచేసి ఉండే ఈ మహాపురుషుని నేను తెలిసికొంటున్నాను. అతడే ఉపాయం, ఉపేయం - అని కూడా తెలిసినవాడు, ఈ జన్మలోనే మోక్షాన్ని పొందుతున్నాడు. మోక్షానికి వేఱు మార్గం లేదు - అనే ఈ రహస్యార్థాన్ని వేదం ఆదరాతిశయంతో ఇంకొక మారు ఉద్ఘోషిస్తున్నది. దీని అర్థం పూర్వానువాకంలో విశేషంగా వివరింపబడింది.

పూర్వానువాకంలో 16వ మంత్రంలో పూర్వార్ధాన్ని, 17వ మంత్రంలోని ఉత్తరార్ధాన్ని గమనించవచ్చు.

3. **ప్రజాపతి శ్చరతి గర్భే అంతః**
**అజాయమానో బహుధా విజాయతే ।**
**తస్య ధీరాః పరిజానంతి యోనిం**
**మరీచీనాం పద మిచ్ఛంతి వేధసః ॥**

(పరమపురుషుడు హృదయంలో అంతర్యామియై సంచరిస్తున్నాడు. ఉత్పత్తి (జన్మ) లేని పురుషోత్తముడు. పలు విధాలుగా జన్మిస్తున్నాడు. అతని అవతారాలనుగూర్చి ధీరులే తెలియగలరు. వారు, పరమపురుషుడు నివసించే నిత్యసూరుల దేశాన్ని కోరుతున్నారు.

**"తతో విష్వఙ్ వ్యక్రామత్ సాశనాశనే అభి"** అని పూర్వానువాకంలో చెప్పబడ్డ అవతారవైభవం ఇక్కడ అనుభవింపబడుతున్నది. **"విషయస్యాతిభూమిత్వాత్ జ్ఞానదౌష్కర్యశంకినామ్, అవతారేణ సౌలభ్యం త్రిష్టుభోక్తం తృతీయయా"** (భగవత్ స్వరూపమనేది జ్ఞానానికి అందనిదైనందున, అతనిని తెలియలేము - అని సందేహించేవారికి, మూడవ మంత్రంలో అవతారసౌలభ్యం చూపబడింది) అని మణవాళమహామునుల ప్రమాణత్తిరట్టులో ప్రస్తావింపబడిన **"నారాయణముని"** అనేవారి వ్యాఖ్యానంలో ఈ మంత్రార్థం సంగ్రహింపబడింది. పూర్వమంత్రంలో బ్రహ్మాన్ని తెలిసినందువల్లనే మోక్షం సిద్ధిస్తుందని చెప్పబడింది. ఇక్కడ అవతారాలు పెక్కింటిని ఎత్తిన అచ్యుతుని తెలియడం సులభం - అని చూపబడుతున్నది.

**(ప్రజాపతిః.... అంతః)** ప్రజలను కాపాడేవాడైన సర్వేశ్వరుని హృదయంలో అంతర్యామిగా సంచరిస్తున్నాడు-అని అర్థం. ఈ వాక్యం నారాయణవల్లిలో కూడా కన్పిస్తున్నది. అందువల్ల నారాయణుడే ఇక్కడ 'ప్రజాపతి' శబ్దంచేత చెప్పబడుతున్నాడు - అని తెలుస్తున్నది. ఇంతేకాక,

సర్వజీవులను రక్షించడం - అనేది విష్ణువుకే అసాధారణమైనది. **"పతిం విశ్వస్య"** అని చెప్పబడ్డ అతడే లోకానికి అంతటికి స్వామి. ఆత్మకు స్థిరమైన పురుషార్థమైన మోక్షాన్ని ఇవ్వడం మిగిలినవారికి సాధ్యం కాదు. నశించే అల్పానందాన్ని ఇచ్చే ఫలాలైన అర్థకామాలనుకూడా వారు భగవానునివల్ల వరాన్ని పొందే ఇస్తున్నారు. మహాభారతంలో **"రాజాధిరాజ స్సర్వేషాం విష్ణు ర్బహ్మమయో మహాన్, ఈశ్వరం తం విజానీయః స పితా స ప్రజాపతిః"** (ప్రభువులందటిలో గొప్ప ప్రభువు, మహనీయుడు. బ్రహ్మస్వరూపి అయినవాడు విష్ణువు. అతడే ఈశ్వరుడని తెలిసికొంటున్నాము. అతడే అందటికి తండ్రి, అతడే ప్రజాపతి) అని చెప్పబడినందున ప్రజాపతి శబ్దంచేత సూచింపబడేవాడు కేశవుడే. **"అసత్తు రక్షకుడై ఉండేవాడు, ప్రజాపతి"** అని నారాయణయతి వ్యాఖ్యానించారు.

**(గర్భే అంతః చరతి)** - హృదయంలో అంతర్యామియై ఉన్నాడు- అని అర్థం. ఈ విధంగా అంతర్యామియై ఉండడానికి కారణమేమి? ప్రయోజనమేమి? దుష్టనిగ్రహ - శిష్టరక్షణాలు కారణాలు కావు. ఈ జీవునకు తనపట్ల అద్వేషాన్ని కల్గించి, ఆభిముఖ్యాన్ని వర్ధిల్లజేయడం కోసం అనంతుడు అంతర్యామియై ఉంటాడు. యోగసాక్షాత్కారం సిద్ధించినవానికి హృదయకమలంలో సేవను అనుగ్రహిస్తాడు. ప్రతిదినం నిద్రించేటపుడు జీవులను ఆలింగనం చేసికొని వారి సకలశ్రమలను తీరుస్తాడు. జన్మ తీరేటపుడు మరణావస్థలో కలిగే శ్రమను తగ్గిస్తాడు. మోక్షాన్ని పొందే జీవులకు సుషుమ్నానాడిని దర్శింపజేసి, దానిద్వారా బ్రహ్మరంధ్రాన్ని భేదించుకొని నిష్క్రమించేటట్లు చేస్తాడు.

అంతర్యామిని తెలియడం చాలా కఠినం. భూగతజలంతో సమానమైనది అంతర్యామి అవస్థ - అని పూర్వాచార్యులు పలికారు. మన్నును తవ్వి తొలగించి, ఆవశ్యకమైతే శిలలను కూడా భేదించి, భూమిలో ఉండే జలాన్ని వెదకి కనుగొనేవారివలె, మాంసశరీరమనే మన్నుతో కప్పబడినది, మనస్సు అనే రాతితో మూయబడినది అయిన అంతర్యామి తెలియరానిది - అని

భూగతజలాన్ని ఉపమానంగా పలికారు. అటువంటివిధంగా అరుదుగా లేకుండా, అందరి మాంసచక్షువులకు లక్ష్యమయే విధంగా అవతారాలను తర్వాత ప్రస్తావిస్తున్నది. ఆ విధంగా అవతరించడానికి కర్మం కారణం కాదు. అనుగ్రహమే కారణం. బావిలో పడిన బిడ్డను పైకి బయటకు తీయడంకోసం తల్లికూడా ఆ బావిలో దూకే రీతిలో, సంసారసాగరంలో మునిగి అవస్థపడే చేతనులను ఆ సముద్రంనుండి తీరాన్ని చేర్చడంకోసం భూమిలో పుట్టి, మానవులకోసం పడరాని పాట్లు పడుతున్నాడు - నారాయణుడు. దుష్టనిగ్రహాన్ని, శిష్టరక్షణాన్ని చేయడానికి పరవాసుదేవుడు జన్మిస్తున్నాడు. ఇంద్రియాలకు అందని తనను సంసారుల కళ్ళకు గోచరమయేటట్లు చేసికొంటున్నాడు. కోరినవానిని అన్నిటిని తన భక్తులకు ఇస్తున్నాడు. చల్లగా కటాక్షించడం, మాటలాడడం, వినడం, నవ్వడం, ఆలింగనం చేసికోవడం ఈవిధంగా పలు విధాలుగా వారిని లోబరచుకొంటున్నాడు. **“హసితం భాషితం చైవ”** (నవ్వడం, మాటలాడడం కూడా) అని వాల్మీకి అన్నారు కదా! శ్రీరాముని ఆలింగనాన్ని తలచి హనుమంతుడు **“భావో నాన్యత్ర గచ్ఛతి”** (నా భావం వేఱెక్కడికి పోదు) అని అన్నాడు. **“సంస్పృశ్యాకృష్య చ ప్రీత్యా సుగాఢం పరిషస్వజే”** (శ్రీకృష్ణుడు అక్రూరుని తాకి, దగ్గరకు లాగి చేర్చుకొని, ప్రీతితో బాగా గాఢంగా ఆలింగనం చేసికొన్నాడు) అనేది కూడా ఇక్కడ స్మరించదగినది.

విభవావతార కాలాలలో లేకుండా పోయినవారికికూడా ఆ లోటు తీరేటట్లుగా స్వీకరించే అర్చావతారం ఇక్కడ ప్రస్తావింపబడినదని చెప్పవచ్చు. ఒకకాలంలో ప్రవహించే అరణ్యంలోని వాగు వంటిది విభవావతారం. అందులో తేటపడిన మడుగువంటిది అర్చావతారం. పాంచరాత్ర వైఖానసాగమాలలో చెప్పబడిన రీతిలో సుధ (సున్నం), శిల మొదలైన ద్రవ్యాలతో నిర్మింపబడిన రూపాలలో ఆవాహనం చేయబడి, శాస్త్రవశ్యుడుగా, అర్చకపరాధీనుడుగా ఈ హృషీకేశుడుంటాడు. జనులందఱి మాంసచక్షువులకు తనను విషయంగా చేసికొని అన్ని మనోరథాలను ఇస్తాడు.

**(అజాయమానో బహుధా విజాయతే)** "జన్మ లేనివాడైనా పలు విధాలుగా జన్మిస్తున్నాడు'' అని అంటున్నది వేదం. **"అజోపి సన్... సంభవామి"** (కర్మకృతమైన జన్మ లేనివాడనైనా కృపాకారణంగా జన్మిస్తున్నాను) అని శ్రీకృష్ణభగవానుడు గీతలో పలికాడు. **"పిఱప్పిల్ పల్ పిఱవి ప్పెరుమాన్"** (కర్మకృతమైన జన్మలు లేనివాడైనా, పలు జన్మలను కల స్వామి) అని **"వేదమ్ తమి*ழ్*శెయ్‌ద మాఱన్"** (వేదాన్ని ద్రావిడీకరించిన నమ్మా*ழ్*వార్లు) అన్నారు.

**(అజాయమానః) - "జనిజరాదిసకలదురిత దూరః"** (పాపఫలమైన జన్మ, వార్ధక్యం మొదలైనవి లేనివాడు) అని నారాయణయతి వ్యాఖ్యానించారు. ఇక్కడ జన్మ అనేది వార్ధక్యం, మరణం మొదలైన వికారాలను లక్షిస్తుంది.

**(బహుధా విజాయతే)** - ఎన్ని జాతులలోనో జన్మించాడు. **"ఎన్నిన్త యోనియుమాయ్ ప్పిఱన్దాయ్!"** (ఎన్నో జాతులలో జన్మించాడు) అని అన్నారు ఆ*ழ్*వార్లు. **"బహూని మే వ్యతీతాని జన్మాని"** (నాకు పలు జన్మలు గడిచాయి) అని తన జన్మను గూర్చి తానే పలికాడు. **"శన్మమ్ పల పల శెయ్‌దు"** (పలు పలు జన్మలు ఎత్తి) అని ఆ*ழ్*వార్లు కూడా అన్నారు.

**(బహుధా)** - దేవ, తిర్యక్, మనుష్యస్థావరాలని చెప్పబడే అన్ని జాతులలోను జన్మించాడు. వ్యూహం, విభవం, అర్చ - అనబడే అన్ని అవస్థలలోను ఆవిర్భవించాడు - అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు. జన్మించడానికి కారణమైన కర్మ లేకపోయినా, కర్మవశ్యులు జన్మించని జాతులలో కూడా పుట్టాడు. కర్మవశ్యుని జన్మలకు అవధి చూస్తున్నాము. అకర్మవశ్యుని జన్మలకు మాత్రం అవధి లేదు.

**(విజాయతే)** - పలు రీతులలో జన్మించాడని, విశేషంగా జన్మించాడని అర్థాలను గ్రహించవచ్చు. "దేవజాతిమొదలైన ఒక్కొక్క జాతిలోను పలు రీతులగా జన్మించాడు'' అనే అర్థాన్ని నారాయణముని తెలిపారు. **"విశేషేణ జాయతే"** - విశేషంగా జన్మిస్తున్నాడు. అప్రాకృత శరీరాన్ని ఇతరసజాతీయంగా చేసికొని జన్మిస్తాడు. **"శఙ్గొడు శక్కరమ్ విల్ ఒణ్మై యుడైయ ఉలక్కై ఒళ్

**వాళ్ తణ్డు కొణ్డు"** (శంఖంతో పాటు చక్రం, విల్లు, ప్రకాశించే ముసలం, ఖడ్గం, గదలను ధరించి) జన్మిస్తాడు. తన ఐశ్వర్యశక్తులలో ఏమీ కొఱత రాని రీతిలో జన్మిస్తున్నాడు. అవతారరహస్యాన్ని తెలిసికొని అనుసంధించినవారి జన్మం తీరేటట్లు జన్మిస్తున్నాడు. జన్మించిన తరువాతనే గొప్పతనాన్ని పొందుతున్నాడు. వేదంలో **"యువా సువాసాః పరీవీత ఆగాత్ స ఉ శ్రేయాన్ భవతి జాయమానః తం ధీరాసః కవయ ఉన్నయంతి"** (యౌవనాన్ని కలవాడుగా, అందమైన పీతాంబరాన్ని ధరించినవాడుగా, నిత్యసూరులచే పరివేష్ఠింప బడినవాడుగా పురుషోత్తముడు జన్మిస్తున్నాడు. జన్మించిన తరువాతనే గొప్పతనాన్ని కలవాడవుతున్నాడు. అతనిని ధీరులైన కవులు ధ్యానిస్తున్నారు) అని కదా చెప్పబడింది.

**(విజాయతే)** - కర్మవశ్యులవలె శరీరంతో జన్మిస్తున్నాడు. వారు పదినెలలు గర్భవాసంలో ఉండి జన్మిస్తే, ఇతడు పన్నెండు నెలలు గర్భవాసం చేసిపుడుతున్నాడు. **"తతశ్చ ద్వాదశే మాసే"** (తరువాత, పన్నెండవ నెలలో) అని కదా చెప్పబడింది. వారికి ఆపద కల్గిన కాలం తనకు జన్మించడానికి కాలంగా చేసికొని జన్మిస్తున్నాడు. వారి సంరక్షణాన్నే ప్రయోజనంగా చేసికొని జన్మిస్తున్నాడు. **"ఆవిర్భూతం మహాత్మనా"** (మహాత్ముడైన నారాయణుడు ఆవిర్భవించాడు) అని వాల్మీకి మహర్షి అవతరించినందువల్ల ఏ దోషం లేదు - అనేదానిని తెలుపడం కోసం **"ఆవిర్భూతమ్"** అని ప్రయోగించాడు. ఆశ్రితార్థం గర్భవాసం చేసిన మహాగుణాన్ని కోల్పోకూడదు - అని వేదం, **"జాయతే"** (పుట్టాడు) అని పల్కింది. ఆళ్వార్లు కూడా **"తోన్టిన వాఱుమ్"** (ఆవిర్భవించిన తీరు) అని అనకుండా, **"పిఱన్ద వాఱుమ్"** (జన్మించిన రీతి) అని కదా అన్నారు. సంసారులకు పుట్టగా పుట్టగా జ్ఞానం మాసిపోతుంది. రత్నాన్ని సానబట్టే కొద్దీ కాంతి అధికమయేటట్లుగా, అవతారాలను ఎత్తేకొలది ఇతని మహాగుణాలు ప్రకాశిస్తాయి. శ్రీరామావతారం కంటే, శ్రీకృష్ణావతారంలో పాండవదూతయై, పార్థసారధియై తన మహాగుణాన్ని ప్రకటించాడు. తాను పలికేటపుడు కూడా **"జన్మ కర్మ చ మే దివ్యమ్"** (నా జన్మలు, లీలలు దివ్యలు)

అని చాలా గౌరవంగా పలికాడు.

**(తస్య ధీరాః పరిజానంతి యోనిమ్) -** అతని అవతారాలను గూర్చి ధీరులే తెలిసికొంటున్నారు.

**(ధీరాః) -** బుద్ధిమంతులని అర్థం. ధీరులైన కవులని వేఱొక శ్రుతిలో చెప్పబడినవారు. పరాంకుశభట్టనాథ పరకాలాదులే ఇతని జన్మమహిమను తెలిసినవారు.

**(ధీరాః) -** జ్ఞానంలో ఏ కలత, కళంకం లేనివారనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. శ్రుతులను తెలియనివారు పురుషోత్తముని అవతారమహిమను తెలియలేక, "పరబ్రహ్మానికి జన్మ అనేది ఉంటుందా?" అని సందేహించి, "ఇతడు మనుష్యుడే కాబోలు" అని మనస్సులో తప్పుగా తలుస్తారు. అటువంటి దోషం లేనివారని భావం. **"పితా పుత్రేణ పితృమాన్ యోనియోనౌ నావేదవిన్మనుతే తం బృహంతమ్"** (ఒక్కొక్క అవతారంలోను సర్వలోకపిత అయిన నారాయణుడు తనచే సృష్టింపబడిన ఒకనిని తనకు తండ్రిగా చేసికొని జన్మిస్తున్నాడు. వేదాన్ని తెలియనివారు. అతడు పరమాత్మ అని తెలియలేరు) అని కదా వేదవాక్కు.

**(తస్య యోనిం పరిజానంతి)** అతని అవతారాన్ని చక్కగా తెలిసికొంటున్నారు.

**(పరిజానంతి)** మాటి మాటికి తెలిసికొంటున్నారు. సకల చేష్టితాలను తెలిసికొంటున్నారు. దీనిని విడచి పరత్వంపట్ల మనస్సు లగ్నమైనవారు కారు. **"భావో నాన్యత్ర గచ్ఛతి"** (నా భావం వేఱొక దానివైపు పోదు) అని అంటారు. **"అచ్చువై పెఱినుమ్ వేణ్డేన్"** (ఆ పరమపదానుభవాన్ని పొందినా, దానిని కోరను) అని తలచి నిశ్చలంగా ఉంటారు. నమ్మాళ్వార్లు, భగవంతుడు యశోదచే రోటికి కట్టబడి, వెక్కి ఏడ్చిన సౌలభ్యగుణాన్ని అనుసంధించగానే **"ఎత్తిఱమ్!"** (ఆహా! ఏమి ఆ రీతి!) అని ఆఱునెలల కాలం మోహాన్ని పొందారు కదా! తిరిగి **"పిఱన్ద వాఱుమ్"** అని పరమపురుషుని జన్మనుగూర్చి అనుసంధించి,

ఆఱునెలల మోహాన్ని పొందారని ఆచార్యులన్నారు. అతని జన్మమహిమను తెలిసినవారిని **"ధీరాః"** అని పొగడింది వేదం. తెలియనివారిని **"మూఢా"** అని గీతలో నిందించాడు శ్రీకృష్ణుడు. **"యోనిమ్"** అని వేదం అన్నది. **"మానుషీం తనుమాశ్రితమ్"** (మానవరూపాన్ని పొందినవానిని) అని అన్నాడు మాధవుడు. తెలిసినవారిని **"పరిజానంతి"** (పూర్తిగా తెలుసుకుంటున్నారు) అని వేదం పల్కింది. తెలియని వారిని **"అవజానంతి"** (అవమానిస్తున్నారు) అని అచ్యుతుడన్నాడు.

ఎందుకోసం ఈ అవతారరహస్యాన్ని తెలిసికొంటున్నారు? అంటే,

**(మరీచీనాం పదమిచ్ఛంతి వేధసః)** జ్యోతిర్మయమైన నిత్యసూరుల పరమపదాన్ని పొందడంకోసం - అని చెప్పబడింది.

**(మరీచీనామ్ పదమ్.... వేధసః)** - నిత్యసూరుల దేశం - అని పల్కిన తరువాత అప్రధానంగా పరమపురుషుని దేశమని చెప్పబడింది. నమ్మాళ్వార్లు కూడా పరమపదాన్ని **"వానవర్నాడు"** (నిత్యసూరుల దేశం) అని అన్నారు అది వారి స్వాధీనంలో ఉన్నందున వారి పరమపదమని చెప్పబడింది. **"వానవర్ నాట్టైయుమ్"** అనే చోట వ్యాఖ్యానంలో మన ఆచార్యులు **"కుడియిరుప్పారోపాది యాయిఱ్ఱు, పరమపదత్తిల్ శ్రీవైకుంఠనాథనుక్కు. ప్రాప్తిదేశమ్ నిత్యసూరికళ్ ఇట్టవழక్కా యిరుక్కుమ్"** (నివాసముంటున్నవారి స్థితి పరమపదనాథునకు ఆ పరమపదంలో కల్గింది. ప్రాప్తిదేశమైన పరమపదం నిత్యసూరుల అధీనంలో ఉండేదిగా అయినది) అని పల్కడం ఇక్కడ అనుసంధేయం. అవతారరహస్యాన్ని గ్రహిస్తే మోక్షాన్ని పొందుతారనేది - **"జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః, త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోర్జున"** (అర్జునా! నా అప్రాకృతాలైన జన్మలను, లీలలను ఈవిధంగా ఎవడు యథార్థమని తెలిసికొంటున్నాడో, అతడు దేహాన్ని విడచి మఱుజన్మను పొందడు. నన్నే పొందుతాడు) అని గీతాచార్యుడన్నాడు. ఈ రీతిలో అవతార వైభవం అన్యదేవతలకు లేదు.

**4. యో దేవేభ్య ఆతపతి యో దేవానాం పురోహితః ।**
**పూర్వేభ్యో దేవేభ్యో జాతః నమో రుచాయ బ్రాహ్మయే ॥**

(ఏ పరమపురుషుడు నిత్యసూరుల కోసం ప్రకాశిస్తున్నాడో, ఎవడు నిత్యసూరులకు అనాదికాలంగా హితాన్ని అనుగ్రహిస్తున్నాడో, ఎవడు నిత్యసూరులలో ప్రథముడై ఉన్నాడో, ప్రకాశించేవాడు, పరబ్రహ్మ స్వరూపుడై ఉండే అతనికి నమస్కారం.)

ఈ మంత్రంలో పురుషోత్తముడు నిత్యసూరి నిర్వాహకుడనే విషయం తెలుపబడింది. దీనిని నమ్మాళ్వార్లు **"వానవరాది యెన్గో! వానవర్ దెయ్వ మెన్గో! వానవర్పోక మెన్గో! వానవర్ము*ఱ్ఱు* మెన్గో!"** (నిత్యసూరులకు కారణమైనవాడు అని అందునా? వారికి దైవమని అందునా? వారి ఆనందమని అందునా? వారికి సమస్తమని అందునా?) అని తిరువాయ్మొ*ళి*లో పలికారు.

**(యో దేవేభ్య ఆతపతి)** - "ఏ పరమపురుషుడు నిత్యసూరులకోసం **"ఆదియఞ్జోది"** అనేటట్లు సనాతనమైన, అందమైన జ్యోతిస్స్వరూపుడై సమస్తకల్యాణగుణాలతో ప్రకాశిస్తున్నాడో" అని అర్థం. జితంతే స్తోత్రంలో కూడా **"భక్తానాం త్వం ప్రకాశసే"** (భక్తులకోసం నీవు ప్రకాశిస్తున్నావు) అని కదా చెప్పబడింది. నమ్మాళ్వార్లు దీనిని **"వానవర్ దెయ్వమెన్గో!"** (నిత్యసూరుల దైవం అందునా?) అని అన్నారు.

**(యో దేవానాం పురోహితః)** - ఏ పరమాత్మ నిత్యసూరుల కోసం అనాదికాలంగా హితాన్ని కల్గిస్తున్నాడో - అని అర్థం. వారికి **"ఉణ్ణుమ్ శోఱు పరుకు నీర్ తిణ్ణుమ్ వె*ఱ్ఱి*లై"** (భుజించే అన్నం, తాగే జలం, ఆనందించే తాంబూలాది భోగ్యవస్తువులు) అయిన భగవత్కైంకర్యాన్ని అనుగ్రహిస్తున్నాడని తాత్పర్యం. **"తద్విప్రాసో విపన్యవః"** (జ్ఞానులు, స్తుతి శీలురు) అని పల్కిన రీతిలో భగవతానుని పరివేష్ఠించి స్తుతించడమనే బ్రహ్మానందాన్ని వారు అనాది కాలంగా అనుభవిస్తున్నారు. కైంకర్యమే యథార్థమైన హితం. ఈ లోకంలో ఉండే ఐశ్వర్యాలు హితాలు కావు. కైవల్యనిష్ఠుల ఆత్మానుభవం కూడా

యథార్థమైన హితం కాదు. ప్రకారపర్యంతమైన (ఆత్మపర్యంతమైన) ఆత్మానుభవమాత్రంలో కూడా ప్రకారి అయిన భగవంతునివరకు ఉండే పరమపురుసార్థ లక్షణరూపమైన మోక్షమే హితమని చెప్పదగినది. శఠకోపులు దీనిని **"వానవర్‌పోక మెన్గో! వానవర్ ముఱ్ఱుమెన్గో!"** (నిత్యసూరుల ఆనందమని అని అందునా? నిత్యసూరులకు సమస్తమని అందునా?) అని అనుగ్రహించారు.

**(పూర్వో యో....జాతః)** ఏ నిత్యసూరులకు మొదటివాడై ఉన్నాడో- అని అర్థం. **"వానవరాది యెన్గో!"** అని నమ్మాళ్వార్లు అన్నారు. నిత్యసూరులకు నిర్వాహకుడని అర్థం. వారి సత్తకు కారణమై ఉండేవాడు. వారు నిత్యులై ఉండేటపుడు వారికి సత్తాహేతువు అని ఏ విధంగా చెప్పవచ్చు? వారి నిత్యత్వం అతని నిత్యేచ్ఛవల్ల ఉన్నందున వారికి భగవంతుడు సత్తాహేతువని చెప్పవచ్చు. ఈ ఇచ్ఛ పోతే నిత్యుల నిత్యత్వం సైతం లేకుండా పోతుంది కదా. అయితే భగవంతుని సంకల్పం కూడా నిత్యం కనుక ఆ స్థితి ఏర్పడే అవకాశం లేదు.

**(రుచాయ)** - దివ్యమంగళవిగ్రహంతో ప్రకాశిస్తూ ఉండే పరమపురుషునకు - అని అర్థం. **"ఒళిమణివణ్ణనై"** (ప్రకాశించే మణి వంటి వర్ణాన్ని కలవానిని) అని చెప్పబడిన అతని జ్యోతిస్స్వరూపం ఇక్కడ తెలుపబడుతున్నది.

**(బ్రాహ్మయే నమః)** - పరబ్రహ్మమై ఉండే శ్రీమన్నారాయణునకు నమస్కారం. **"నారాయణాయ నమః"** అని ద్వయంలో చెప్పబడినది ఇక్కడ తెలుపబడుతున్నది. **"బ్రాహ్మయే"** అనే ప్రయోగంలోని చతుర్థీవిభక్తివల్ల కైంకర్యం ప్రార్థింపబడుతున్నదని, **"నమః"** అని ఆ కైంకర్యంవల్ల కలిగే ఆనందం నాది కాదు. భగవానునిదే- అని చెప్పబడుతున్నదని గ్రహించాలి. ఈ మంత్రంలోని దేవశబ్దాలకు దేవ పరంగా కూడా ఆచార్యులు అర్థాన్ని గ్రహించాడు.

5. రుచం బ్రాహ్మం జనయంతః దేవా అగ్రే తదబ్రువన్ ।
యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్ తస్య దేవా అసన్ వశే ॥

(పరబ్రహ్మకు ప్రీతిని కల్గించే నిత్యసూరులు పురుషోత్తమునకు ఎదురుగా "నమః" అనే పదాన్ని పలికారు. బ్రహ్మజ్ఞానియైన ఒకడు నిన్ను ఈ విధంగా తెలిస్తే, అతనికి బ్రహ్మాదిదేవతలు వశం అవుతారు.)

**(రుచం బ్రాహ్మం జనయంతః దేవాః)** - పురుషోత్తమునకు ప్రీతిని కల్గించే దేవతలైన నిత్యసూరులు - అని అర్థం. అతని సమక్షంలో **"నమః"** అనే శబ్దాన్ని పల్కుతున్నారు. దీనివల్ల భగవంతుని ముఖోల్లాసంకోసం కైంకర్యం చేయుబడుతున్నదే తప్ప మన ఆనందంకోసం కాదని దీనివల్ల తెలుపబడుతున్నది. అతడు ఆనందిస్తున్నాడు కనుక, మనం ఆనందించి చేయాలే తప్ప మన ఆనందంకోసం కైంకర్యం చేయకూడదు. **"నమః"** అనే పదం **"అహమపి న మమ భగవత ఏవాహ మస్మి"** (నేను నాకోసం కాదు, భగవంతుని కోసమే ఉన్నాను) అర్థాన్ని కల్గినది కదా! **"నమ ఇత్యేవవాదినః"** (నిత్యసూరులు **"నమః"** అని పల్కుతూ ఉంటారు) అని కదా చెప్పబడింది. **"నమః"** అనే పదం చాలా గొప్పదిగా కదా తలచి భగవంతుడు ఆనందిస్తాడు.

**(యస్త్వైవం...)** ఎవడు ఈ విధంగా భగవత్కైంకర్యం పరమపురుషార్థమని తెలిసికొంటాడో, అతనికి బ్రహ్మాదిదేవతలు వశమవుతారు. శ్రీవిష్ణుపురాణంలో **"స్వపురుష మభివీక్ష్య పాశహస్తం వదతి యమః కిల తస్య కర్ణమూలే, పరిహర మధుసూదనప్రపన్నాన్ ప్రభురహ మన్యనృణాం న వైష్ణవానామ్"** (యముడు, పాశాన్ని చేతిలో ధరించిన తన కింకరుని చూచి తని చెవిలో రహస్యంగా ఈ విధంగా అన్నాడు. "మధుసూదనుని శరణు పొందినవారివద్దకు పోవద్దు. నేను మిగిలినవారికే ప్రభువును, వైష్ణవులకు కాదు") అని చెప్పబడింది. తిరుమழிశై ఆழ்వార్లు కూడా **"తిఱమ్బేల్మిన్ కణ్డీర్ తిరువడితన్నామమ్ మఱన్దుమ్ పుఱన్తొழா మాన్దర్, ఇఱైజ్జియుమ్ శాదువరాయ్ ప్పోదుమిన్‌కళెన్డాన్ నమనుమ్ తన్ తూదువరై క్కూవి చ్చెవిక్కు"** (భగవానుని

నామాన్ని మరచి అనుసంధానాన్ని చేయకపోయినా, ఇతరదేవతలను కొలువనివారికి మీరు నమస్కరించి, వారి విషయంలో సాధువులై వర్తించండి అని యముడు తన కింకరులను పిలచి వారి చేవిలో చెప్పాడు) అని ఈ శ్లోకంలోని అర్థాన్ని పలికారు. తొణ్డరడిప్పొడియాళ్వార్లు **"నావలిట్టుళితరుకిన్టోమ్ నమన్‌తమర్‌తలైకళ్ మీదే"** (నావలో! నావల్! అని జయధ్వానాన్ని చేస్తూ, యముని కింకరుల శిరస్సులపై పాదాలను మోపుతాము) అని అన్నారు. తిరుమంగైమన్నన్ **"వళ్ళలే! ఉన్ తమర్ క్కెన్టుమ్ నమన్‌తమర్ కళ్ళర్‌పోల్"** (ఉదారుడా! యమదూతలు నీ భక్తులను చూచి దొంగలవలె పారిపోతారు) అని అన్నారు. **"ఎన్ తమర్ నమన్ తమరాల్ ఆరాయప్పడార్‌కళ్"** (నా భక్తులు యమకింకరులచే విచారింపబడరు) అని, **"నమన్ తమర్ ఎన్ తమరై వినవప్పెఱువారలర్"** (యమదూతలు నా భక్తులను విచారించరు) అని అచ్యుతుడు అభయమిచ్చాడు. భగవానుని ఆశ్రయిస్తే, ఏదేవతలవల్ల కల్గిన ఆపద అయినా నశిస్తుంది. **"పిఞ్జకన్ తన్నొడుమ్ ఎదిర్‌వన్ అవన్ ఎనక్కు నేరాన్"** (శివుని కూడా ఎదిరిస్తాను. అతడు కూడా నాకు సాటికాదు) అని కదా తిరుమళిశైప్పిరాన్ సూక్తి.

6. **హ్రీశ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ అహోరాత్రే పార్శ్వే ।**
**నక్షత్రాణి రూపమ్ అశ్వినౌ వ్యాత్తమ్।**
**ఇష్టం మనిషాణ అముమ్ మనిషాణ సర్వం మనిషాణ ॥**

(నీకు భూదేవి, శ్రీదేవి పత్నులు. పగలు, రాత్రి ఇరు వైపుల ఉన్నాయి. నీ రూపం నక్షత్రాలవలె కాంతిని కల్గినది. అశ్వినీదేవతల వలె నీ ముఖం అందంగా ఉన్నది. మాకు ఇష్టాన్ని ప్రసాదించు, అన్నిటిని అనుగ్రహించు.)

గడచిన రెండు మంత్రాలలో చెప్పబడిన కైంకర్యం, భగవంతుడు-లక్ష్మీదేవి కలసి ఉండే సన్నివేశంలో చేయాలని ఈ ఋక్కు తెల్పుతున్నది. ఇంతవరకు విగ్రహంతో, రూపంతో, పరికరాలతో పరమపురుషుడు

వర్ణింపబడ్డాడు. పురుషసూక్తంలోని చివరి మంత్రమైన దీనిలో అతనికే అసాధారణమైన దేవేరుల సంబంధాన్ని పురస్కరించుకొని నిశ్చయింపబడుతున్నాడు. భట్టర్ కూడా **"వేదాంతా స్తత్త్వచింతాం మురభిదురసి యత్ పాదచిహ్నై స్తరంతి"** (వేదాంతాలు మురారి వక్షస్సులో ఏ లక్ష్మీదేవి పాదచిహ్నాలతో పరతత్త్వవిచారాన్ని చేస్తున్నాయో) ఈ విషయాన్ని అందంగా పలికారు. ఇంతేకాక **"ఈష్టే కశ్చిత్ జగత ఇతి యః పౌరుషే సూక్త ఉక్తః, తం చ త్వత్కం పతి మధిజగా వుత్తరశ్చాను వాకః"** (పురుషసూక్తంలో లోకానికి అంతటికి నాయకుడై చెప్పబడినవానిని, నీ పతి అని ఉత్తరానువాకం ఘోషించింది) అని అన్నారు. లక్ష్మీపతి, భూవల్లభుడు, నీళానాథుడు అచ్యుతుడే. ఇక్కడ తెలుపబడుతున్నాడు. మనకు ఉపాయోపేయాలు శ్రియఃపతియే తప్ప బ్రహ్మచారి నారాయణుడు కాడు - అనే శ్రీవైష్ణవసిద్ధాంతం ఇక్కడ వ్యక్తం చేయబడింది.

**(తే)** - 'నీకు' అని అర్థం. **(1)** వేయి శిరస్సులను, వేయి కన్నులను, వేయి పాదాలను కల నీకు, **(2)** సకల చరాచరాలలో వ్యాపించి ఉండే నీకు, **(3)** **"సర్వం విష్ణుమయుం జగత్"** (ఈ జగత్తు అంతా విష్ణువుచే వ్యాపింపబడినది) అనబడే నీకు, **(4)** దేశకాలవస్తు పరిచ్ఛేదాలను లేని నీకు, **(5)** మోక్షానికి ప్రభువైన నీకు, **(6)** చతుర్ముఖుని సృష్టించిన నారాయణుడైన నీకు, **(7)** బ్రహ్మాండాన్ని సృష్టించిన నీకు, **(8)** శ్రీవైకుంఠవాసివి అయిన నీకు, **(9)** ప్రకృతిమండలానికి ఆవలి వైపున గల జ్యోతిస్స్వరూపుడవైన నీకు, **(10)** చిదచిత్తులకు నామరూపాలను ఇచ్చిన నీకు, **(11)** బ్రహ్మరుద్రేంద్రాదులచే ధ్యానింపబడే నీకు, **(12)** "నిన్ను ఉపాసించినవారికి తప్ప, అన్యులకు మోక్షం లభించదు" అనే కీర్తిని కల నీకు, **(13)** క్షీరాబ్ధిలో శయించినవాడవై, అంతర్యామివై ఉండే నీకు, **(14)** జన్మ లేనివాడవైనా, పలు రీతులలో జన్మించే నీకు, **(15)** అవతార రహస్యాన్ని తెలిసినవారిచే పొందబడే నీకు **(16)** నిత్యసూరులకు నాథుడవై, వారిచే సేవింపబడేవాడవైన నీకు - అని భావం.

ఇక, ఇంతవరకు చెప్పబడిన అతిశయాలకు మించిన వేఱొక అతిశయం చెప్పబడుతున్నది.

**(హ్రీశ్చ లక్ష్మీశ్చ పత్న్యౌ)** - భూదేవి, శ్రీదేవి నీకు పత్నులు. ఇక్కడ రెండవ చకారంతో నీళాదేవికూడా లక్షింపబడుతున్నది. నమ్మాళ్వార్లు కూడా తిరువిరుత్తమనే ప్రబంధంలో **"కుழలక్కోవలర్ మడప్పావైయుమ్, మణ్మకళుమ్ తిరువుమ్"** (పిల్లన గ్రోవిని ఊదే గోపాలుర కులంలో పుట్టిన అందమైన నీళ, భూదేవి, లక్ష్మీదేవి) అని అన్నారు. "ఆశ్రితుల దోషాలను సహించేటట్లు చేస్తుంది, లక్ష్మీదేవి. "దోషాన్ని చూడడం ఎందుకు? దానిని సహించడం ఎందుకు?'' అని భూదేవి అంటుంది. నప్పిన్నై అయితే క్షమ మూర్తీభవించినదై ఉంటుంది. లక్ష్మీదేవి భగవంతునకు సంపద. అది ఫలించే భూమి భూదేవి. ఆ సంపదను అనుభవించే భోక్త నీళాదేవి'' అనే పెరియవాచ్చాన్‌పిళ్ళై శ్రీసూక్తి ఇక్కడ స్మరణీయం. **"న కశ్చిన్నాపరాధ్యతి"** (ఈలోకంలో అపరాధం చేయనివారెవరు?) అని అంటుంది శ్రీదేవి. "దోషమే లేదుకదా'' అని అంటుంది భూదేవి. **"క్షమయా పృథివీసమః"** (క్షమాగుణంలో భూమితో సమానుడు) అని కదా చెప్పబడింది. భూదేవి పట్ల మనం చేసే అపచారాలకు అంతు లేదు. ఆమె మనకు చేసే హితాలను అవధి లేదు. ఆమె మనం నిలచి ఉండడానికి సహాయపడుతుంది. మనం నడచేటపుడు, కూర్చున్నపుడు, శయనించేటపుడు మనలను మోస్తున్నది. మనం ప్రాణంతో నిలచి ఉండడానికి కావలసినవానిని అన్నిటినీ ఇచ్చి కాపాడుతుంది. దీనికి బదులుగా మనం ఆమెను తవ్వుతున్నాము. పదునైన ఆయుధాలతో గుచ్చి, గీరి గాయపరుస్తున్నాము. మలజలాదులను విడచి అశుద్ధంగా చేస్తున్నాము. భూదేవి పుత్రులమైన మనం ఒకరితో ఒకరు ద్వేషాన్ని పెంచుకోవడం ద్వారా, దూషించుకోవడం ద్వారా, అంతు లేని దుఃఖాలను ఆమెకు కల్గించడం ద్వారా మనం తల్లి అయిన భూమిని బాధిస్తున్నాము. క్షమ అనే పాపాలను మనకు తాగించిన తల్లి దారిలో మనం వర్తించవద్దా? క్షమాదేవిపుత్రులు క్షమ లేకుండా ఉండవచ్చునా? క్షమలో గొప్పది అయినందున, భూమిలో పుట్టి పెరిగిన మనకు

ఇహపరపురుషార్థాలను పొందేటట్లు చేసేది ఈమెయే కనుక, మొదట **"హ్రీః"** అని భూదేవి నిర్దేశింపబడింది. దేశభక్తి అనేది తల్లిప్రేమయే అయితే, ఆ మాధవి మాధవునిది. ఆమెపట్ల భక్తి అనే పేరును పెట్టుకొని ధరణీనాథుని ఆజ్ఞను మీరుతున్నారు, కొందఱు. "భూదేవి, వారిని సహించక, భారంగానే తలుస్తుంది. "సీతాదేవిని శ్రీరామునివద్దనుండి విడదీసిన రావణుడు శిరచ్ఛేదాన్ని ఫలంగా పొందాడు. విశ్లేషింపజేయాలని చూచిన శూర్పణఖ ముక్కుచెవులను కోల్పోయింది'' అని మన పూర్వాచార్యులు పల్కిన సూక్తి ఇక్కడ అనుసంధేయం.

**(లక్ష్మీః)** - దివ్యలక్షణాలను పొందికగా కల్గినది కనుక, లక్ష్మి అనే కీర్తిని పొందినది, లక్ష్మీదేవి. దేవమనుష్యాదులందఱిచే ప్రార్థింపబడేది కనుక, లక్ష్మి అనబడుతున్నది - అని కూడా చెప్పవచ్చు. భగవానునకు జ్ఞానానందాది గుణాలవలె ఈమె స్వరూపనిరూపకమై ఉంటుంది. మిగిలిన అన్యదేవేరులకు నాయకురాలై ఉంటుంది. జీవులకు పురుషకారమై ఉంటుంది. లోకంలోని ఐశ్వర్యాలను అన్నిటిని అనుగ్రహించేది శ్రీదేవియే.

**(హ్రీశ్చ లక్ష్మీశ్చ)** శ్రీదేవి సంపద. సర్వసంపదలు ఫలించే చోటు భూదేవి. గొప్పతనాన్ని నది లక్ష్మీదేవి. సహనాన్ని కల్గినది భూదేవి. గుణాలను కల్గినది శ్రీదేవి. గంధాన్ని కల్గినది భూదేవి (గంధవతీపృథివీ అని కదా పృథివి లక్షణం.) అందాన్ని కల్గినది శ్రీదేవి, కీర్తిని కల్గినది భూదేవి. ఆదరాన్ని కల్గినది శ్రీదేవి, ఆధారమైనది భూదేవి.

**(పత్న్యౌ)** - ఇటువంటి కీర్తిని కల వీరు పరమపురుషునకు పత్నులు - అని దీనిచే చెప్పబడుతున్నది. **"పతిమ్ నయతి"** అనే వ్యుత్పత్తిని బట్టి సర్వేశ్వరుని తాను కనుసైగ చేసిన చోట అనుగ్రహించేటట్లు చేసేది - అనే అర్థాన్ని చెప్పవచ్చు. **"యస్యా వీక్ష్య ముఖం తదింగితపరాధీనో విధత్తేఖిలమ్"** (ఏ లక్ష్మీదేవిముఖాన్ని చూచి, ఆ ముఖభావాలను బట్టి సర్వేశ్వరుని అన్ని కార్యాలను చేస్తాడో) అని కూరేశులు పలికారు కదా!. "సంతానాన్ని (ప్రజలను) భగవంతుని దగ్గరకు తీసికొని వెళ్ళేది'' అనే అర్థాన్ని చెప్పవచ్చు. దీనివల్ల ఇరువురు (శ్రీదేవి,

భూదేవులు) పురుషకారంగా ఉన్నారని తెలుపబడింది. **"లక్ష్మీః పురుషకారత్వేన నిర్దిష్టా పరమర్షిభిః"** (లక్ష్మీదేవి పురుషకారం చేసేదిగా మహర్షులచే నిర్ణయింపబడింది) అనే పాంచరాత్రవచనం ఇక్కడ అనుసంధేయం. భూదేవి కూడా పురుషకారాన్ని చేస్తుంది - అనే విషయాన్ని **"విష్ణుక్రాంతే వసుక్రాంతే... త్వయా హతేన పాపేన గచ్ఛామి పరమాం గతిమ్"** (విష్ణువుచే త్రివిక్రమావతార రూపునిచే- ఆక్రమింపబడిన భూమీ! - నీచే పాపం తొలగింపబడినవాడనై పరమపదాన్ని పొందుతాను) అని వేదంలో చెప్పబడింది. **"పత్యుర్నో యజ్ఞసంయోగే"** అనే పాణినిసూత్రానుసారం ఆశ్రితులను రక్షించడమనే యజ్ఞంలో సహధర్మచారిణిగా ఉంటుంది - అనే పత్నిశబ్దానికి అర్థాన్ని చెప్పవచ్చు. **"హ్రీః"** అని లజ్జకు అభిమానిదేవత. **"లక్ష్మీః"** అని సంపదకు అభిమాని దేవత - అని అన్నారు. విద్యారణ్యులు.

ఏ లోకంలో ఉండేవారైనా, ఏ మతంలో ఉండేవారైనా కోరేవి ఇహలోక పురుషార్థం ధనం, ధాన్యం, సౌఖ్యం - అనేవే కదా. వీనిని ఇచ్చేవారు శ్రీభూమీ నీళాదేవులే. ఈ ముగ్గురినీ స్తుతిస్తూ శ్రీసూక్తం, భూసూక్తం, నీళాసూక్తం - అనేమూడు సూక్తాలు వేదంలో పఠింపబడ్డాయి. శ్రీసూక్తం లక్ష్మిని గూర్చి తెల్పుతుంది అనేదానిని శైవులతో పాటు అందఱు ఒప్పుకొంటున్నారు. శ్రీదేవిచే అనుగ్రహింపబడే ఐశ్వర్యాలు, భూమిచే లభించే నవధాన్యాలు, కూరగాయలు, ఆ భూమిలోని మన్ను, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం - అనే పంచభూతాలు లేకుండా మానవులు కాని, మిగిలిన ప్రాణులు కాని ప్రాణాలతో నిలచి ఉండడం సాధ్యమా? ఇహలోక సుఖసాధనాలైనందున నేయి, పాలు, పెరుగు, తినే అన్నం, తాగే నీరు, ఆస్వాదించి ఆనందించే తాంబూలాది భోగ్యవస్తువులు మొదలైన పదార్థాలను కోరనివారు ఈ లోకంలో ఎవరున్నారు? ఈ శ్రీసూక్తభూసూక్త నీళాసూక్తాలను పఠించడంవల్ల ఇహలోకపురుషార్థాలను అన్నిటిని పొందవచ్చు. వీటిని ఇవ్వడం మాత్రమేకాక, పరమపురుషార్థమైన భగవత్కైంకర్యాన్ని కూడా ఈ పరంధాముని పత్నులు ఇస్తారు. పురుషోత్తముడు తన పత్నులద్వారా వానిని అనుగ్రహిస్తాడు.

**(అహోరాత్రే పార్శ్వే)** పగలు, రాత్రి విడువకుండా పరంధాముని పార్శ్వాలలో ఈ పత్నులుంటారు. **"అకలకిల్లేన్ ఇఱైయుమ్"** అనే రీతిలో విడువకుండా ఉంటారు. నమ్మాళ్వార్లు కూడా **"ఉడనమర్ కాదల్ మకళిర్ తిరుమకళ్ మణ్మకళ్ ఆయర్ మడమకళ్ ఎన్టివర్ మూవర్"** (భగవానుని వెంట ఉండే ప్రియపత్నులు - లక్ష్మీదేవి, భూదేవి, గోపాల కన్య అయిన నీళాదేవి- అని ముగ్గురు) అని, **"నిழల్ పోల్వనర్"** (నీడవంటివారు) అని అన్నారు. ఎందుకోసం ఈ విధంగా ఉన్నారు? అంటే, **"చంచలం హి మనః"** (మనస్సు చంచలమైనది) అని, **"నిన్టవా నిల్లా నెఞ్జు"** (నిలచిన రీతిలో నిలువని మనసు) అని పలికే రీతిలో చేతనులు చాలా అస్థిరమైన మనస్సును కలవారైనందున, వారికి భగవంతుని పట్ల రుచి కలుగగానే వారిని భగవంతుని వద్దకు చేర్చాలనే ఉద్దేశ్యంతోనే ఆ పత్నులు అచ్యుతుని వెంటనే ఉంటారు. ఇంతేకాక, దివ్యదంపతులిరువురి చేరికయే ప్రపన్నునకు ఉద్దేశ్యం. **"దేవిమారావార్ తిరుమకళ్ పూమి ఏవ మఱ్ఱమరర్ ఆట్చెయ్‌వార్"** (దివ్యదేవేరులైన లక్ష్మి, భూమి ప్రేరేపింపగా మిగిలిన నిత్యసూరులు కైంకర్యం చేస్తారు) అని నిత్యసూరులు కూడా ఈ పత్నులచే నియమింపబడి కైంకర్యాన్ని చేస్తారని చెప్పబడింది కదా! వారు చేసిన ఆజ్ఞను వినడమే పరమానందకరంగా ఉంటుంది. లక్ష్మణుడు **"క్రియతా మితి మాం వద"** (నీచే చేయబడాలి - అని నన్ను ఆజ్ఞాపించు) అని దీనిని అభిలషించాడు కదా! **"రమమమాణా వనే త్రయః"** (శ్రీరాముడు, సీత, లక్ష్మణుడు - అనే ముగ్గురు వనంలో ఆనందించారు) అని పల్కిన రీతిలో జీవుడు, భగవంతుడు, లక్ష్మీదేవి - అనే ముగ్గురి చేరికయే పరస్పరానందాన్ని ఇస్తుంది. సీతారాముకు పరస్పరసంశ్లేషంవల్ల కలిగిన సంతోషం, లక్ష్మణునకు ఈ ఇద్దఱి చేరికను సేవించనందువల్ల ఏర్పడిందికదా! ఇక్కడ దివ్యదేవేరులు, భగవానుడు వేర్వేరు తత్త్వాలనేది తెలుపబడినది. **"రామస్య దక్షిణే పార్శ్వే పద్మా శ్రీ స్సమవస్థితా, సవ్యే తు హ్రీ ర్విశాలాక్షీ"** (శ్రీరాముని కుడివైపున లక్ష్మీదేవి, ఎడమవైపు విశాలమైన కన్నులను కల భూదేవి ఉన్నారు) అనే శ్రీరామాయణ వచనం ద్వారా ఈ మంత్రం వివరింపబడింది.

ఇందువల్ల **"తిరువిల్లా త్తేవరై త్తేఱేల్మిన్ తేవు"** (లక్ష్మిలేని దైవాన్ని పరదైవంగా కొలువకండి) అని తిరుమழிశై ఆழ்వార్లచే పల్కిన రీతిలో మిగిలిన దైవాలకంటే మాధవుని గొప్పతనం చెప్పబడింది. **"మஙறிరున్దీర్క్కటియులాగా మాదవవెన్బదోర్"** ప్రేమికుడైన అచ్యుతునకు **"దేవ్యా కారుణ్యరూపయా"** (కరుణారూపిణి అయిన లక్ష్మి) అనే ప్రసిద్ధిని పొందిన తామరపుష్పనివాసిని అయిన లక్ష్మీదేవి, మాధవి అయిన భూదేవి పత్నులై, చేతనులను సృష్టించేటట్లు, మోక్షాన్ని పొందేటట్లు చేస్తారు. ఈ ముగ్గురు కలసి ఒకరికొకరు చేతనులపట్ల ప్రేమను చూపడంలో పోటీపడతారు.

**"తన్నడియార్ తిఱత్తకత్తు త్తామరై యాళాకిలుమ్ శిదకురైక్కుమేల్, ఎన్ అడియార్ అదు శెయ్యార్ శెయ్‌దారేల్ నన్ఱు శెయ్‌దార్ ఎన్బర్‌పోలుమ్"** (తన భక్తుల విషయంలో లక్ష్మీదేవి అయినా దోషాన్ని పల్కితే, నా భక్తులు దానిని చేయరు, చేస్తే మంచినే చేస్తారు- అని అంటాడు) అని పెరియాழ்వార్లు కూడా అన్నారు. ఈ విధంగా భగవానునకే శ్రీదేవి, భూదేవి, నీళ అనే ముగ్గురు పత్నులు పరత్వావస్థలో కూడా ఉన్నారని చెప్పబడింది.

**"వైకుంఠే తు పరేలోకే శ్రీసహాయో జనార్దనః, ఉభాభ్యాభూమి నీళాభ్యాం సేవితః పరమేశ్వరః"** అనే పురాణవచనం స్మరణీయం.

**(నక్షత్రాణి రూపమ్)** - నీ రూపం నక్షత్రాలవలె అందంగా ఉన్నది- అని భావం. ఆదిత్యునివంటి కాంతిని కల్గినవాడు-అని ముందు చెప్పడంతో తృప్తిని పొందకుండా "లెక్కలేనన్ని నక్షత్రాలవలె అందమై ఉన్నది, నీ జ్యోతిస్స్వరూపం" అని ఇక్కడ చెప్పబడుతున్నది. శంఖచక్రాలు, దివ్యాభరణాలు, హిరణ్యవర్ణ అయిన లక్ష్మీదేవి, పీతాంబరం మొదలైన వానిలో కూడిన భగవానుని దివ్యమంగళవిగ్రహం నక్షత్రాలతో కూడిన నీలమేఘం వలె వెల్గుతుంది కదా! **"తారారూపాణి దృశ్యంతే యాన్యేతాని నభఃస్థలే, మమ రూపాణి తాన్యేవ"** (ఆకాశంలో కన్పించే నక్షత్రరూపాలన్నీ నా రూపాలే) అని మహాభారతం ఆరణ్యపర్వంలో శ్రీకృష్ణభగవానుడు మార్కండేయుని ఉద్దేశించి పల్కిన

వచనాన్ని అనుసరించి నక్షత్రాలు భగవంతుని శరీరాలే - అనే అర్థాన్ని గ్రహించవచ్చు.

**(అశ్వినౌ వ్యాత్తమ్)** - గొప్ప అందమైన నీ ముఖమండలం అశ్వినీదేవతలవలె వెల్గుతున్నది. **"అழకనే! కాప్పిడ వారాయ్"** (అందగాడా! రక్షపెడతాను రా!) అని పెరియాழ్వార్లు అన్నారు. చూచినవారి మనస్సును దోచే అందాన్ని కలవాడు కదా శ్రీకృష్ణుడు. అశ్వినీదేవతల కంటే అందమైన రూపాన్ని కలవారు లీలావిభూతిలో ఎవరూ లేనందున వీరు ఉపమానంగా చెప్పబడ్డారు. వీరు సైతం భగవంతుని ముఖమండలానికి సాటి రాలేరు. భట్టర్ శ్రీరంగరాజస్తవంలో **"విహరతు మయి రంగిణః చూళికా భ్రమరకతిలకోర్ధ్వపుండ్రోజ్జ్వలమ్, ముఖ మమృతతటాకచంద్రాంబుజ స్మరహరశుచిముగ్ధమందస్మితమ్"** (కిరీటం, ఫాలంలో కదలాడే ముంగురులు, తిలకం, ఊర్ధ్వపుండ్రం- అనే వీటిచే ప్రకాశించేది, అమృతతటాకం, చంద్రుడు, తామరపూవు -అనే వాని గర్వాన్ని హరించేది, తెల్లని, అందమైన మందహాసాన్ని కల్గినదైన శ్రీరంగనాథుని ముఖం నాలో విహరించాలి) అని అంటూ భగవంతుని ముఖం సాటి లేనిదని అన్నారు కదా!

ఇకపై వేదపురుషుడు ఈ పురుషసూక్తాన్ని అనుసంధించినవారికి ఇహలోకపురుషార్థాలను, భగవత్కైంకర్యాన్ని ఇవ్వాలని పురుషోత్తముని ప్రార్థిస్తున్నారు. ఇక్కడ కైంకర్య ప్రార్థన చేయబడుతున్నది - అనే విషయాన్ని పెరియవాచ్చాన్‌పిళ్ళై 'పరన్దరహస్యము'నే గ్రంథంలో తెలిపారు.

**(ఇష్టం మనిషాణ)** - వీరు కోరిన పురుషార్థాలను అంతటిని ఇస్తుంది - అని భావం దీనివల్ల ప్రయోజనాంతరపరులు కారా! అనే సందేహం కల్గుతుంది. పురుషోత్తమునివద్ద అన్యఫలాలను మనకోసం కోరితే ప్రయోజనాంతరపరులం అవుతాము. శ్రీవైష్ణవులకు ఈలోకంలో ఉండే అన్ని సంపదలు కలగాలని ప్రార్థించడం దోషం కాదు. ఆழ్వార్లు కూడా **"నన్మక్కళై ప్పెత్ఱు మకిழ్వరే"** (మంచి సంతానాన్ని పొంది ఆనందిస్తారు) అని, "నల్ల

**పదత్తాల్ మనైవాழ்వార్ కొణ్డపెణ్డిర్ మక్కళే"** (పత్నులు, సంతానం మంచి స్థితిలో గృహస్థజీవనాన్ని గడుపుతారు) అని, **"విడుమాల్ వినై వేణ్డిడిల్ మేழுలకమ్ ఎళిదాయిడుమ్ అన్ఱి ఇలఙ్గొళిశేర్ కొడుమాకడల్ వైయకమ్ ఆణ్డు మదిక్కుడై మన్నరాయ్ అడికూడువరే"** (క్రూరమైన కర్మలు అప్పుడే వెంటనే నశించిపోతాయి. కోరుకుంటే స్వర్గం మొదలైన పరలోక సుఖాలు సులభంగా లభిస్తాయి. అంతేకాక, అంతటా వ్యాపించి ప్రకాశించేది, గొప్ప కాంతిని కలిగినది, గొప్పది అయిన సముద్రంచే చుట్టబడిన భూమిని - చంద్రుని వలె తెల్లని వర్ణాన్ని కల గొడుగు కింద ఉండే ప్రభువులై పాలించి, తరువాత భగవంతుని శ్రీచరణాలను చేరగలరు) అని అన్నారు కదా!

**(అముమ్ మనిషాణ)** - పూర్వమంత్రాలలో చెప్పబడిన కైంకర్యం **"అముమ్"** అని ఇక్కడ నిర్దేశింపబడింది. నిత్యసూరులు చేసే కైంకర్యాన్ని ఇవ్వాలి. పురుషార్థమైన భగవదనుభవాన్ని ఇవ్వాలి. లక్ష్మీదేవి, నీవు కూడి ఉండే చేరికలో కైంకర్యాన్ని అనుగ్రహించాలి.

**(సర్వం మనిషాణ)** - అన్నిటిని ఇవ్వాలి. **"వేణ్డిర్ఱెల్లామ్ తరుమ్ కోదిల్"** (కోరిన దానిని అంతటినీ ఇచ్చే ఉదారుడు) కదా దామోదరుడు. **"శాయ్కొణ్డ ఇమ్మైయుమ్ శాదిత్తు వానవర్నాట్టైయుమ్ నీ కణ్డుకొళ్ -ఎన్ఱు వీడుమ్ తరుమ్ నిన్ఱు నిన్ఱే"** (ప్రకాశించే ఇహలోకసుఖాన్ని ఇచ్చి, పరమపదాన్ని కూడా పొందు - అని మోక్షపురుషార్థాన్ని కూడా ఇస్తాడు) అని అన్నారు నమ్మాழ்వార్లు.

ఈ ఋక్కులో అచ్యుతుని భక్తి అనే ఆరని దీపాన్ని శ్రీదేవి భూదేవులు వెలిగిస్తారని, పురుషోత్తముడు ప్రేమమయుడని, జ్యోతిస్స్వరూపుడని, అందమైన రూపాన్ని కలవాడని చెప్పబడింది. **"సర్వం జగన్మమ భవదేదితి సంచింతయన్ మునిః, ధ్యాయేత్ పురుషసూక్తేన ప్రతిపాద్య జనార్దనమ్, విష్ణుః పురుషసూక్తార్థ ఇతీయం వైదికీ శ్రుతిః, పురుషస్య హరే స్సూక్తం సర్వపాపప్రణాశనమ్"** (ఈ లోకం అంతా నాకు చెందాలి - అని భావించి ముని పురుషసూక్తంతో

జనార్దనుని ప్రతిపాదించి, ధ్యానించాలి. విష్ణువే పురుషసూక్తంతో చెప్పబడతాడని వేదంలో చెప్పబడింది. హరి - అనే పురుషుని స్తుతించే ఈ సూక్తం అన్ని పాపాలను తీరుస్తుంది) అని గార్గశౌనకమహర్షులచే పురుషసూక్తం నారాయణుని తెల్పుతున్నదని చెప్పబడింది. బోధాయనులు కూడా **"అథైనమ్ ఋగ్యస్సామభి ష్టువంతి ధ్రువసూక్తం జపిత్వా పురుషసూక్తం చ, అన్యాం శ్చ వైష్ణవాన్ మంత్రాన్"** (ఈ నారాయణుని ధ్రువసూక్తాన్ని, పురుషసూక్తాన్ని, మిగిలిన వైష్ణవమంత్రాలను జపించి, ఋగ్యజుస్సామవేదాలతో స్తుతిస్తారు) అని విష్ణువు యొక్క ఆరాధనలో పురుషసూక్త జపం చేయాలని విధించారు.) **"ఏషా వైష్ణవీ నామ సంహితా, ఏతాం ప్రయుంజన్ విష్ణుం ప్రీణాతి"** (ఇది విష్ణువుయొక్క నామసంహిత. దీనిని ప్రయోగించేవాడు విష్ణువును ప్రీతిపరుస్తున్నాడు) అని సామవిధి బ్రాహ్మణంలో చెప్పబడింది. ఆథర్వణంలోని గోపథబ్రాహ్మణంలో **"వైష్ణవ్యా పురుషసూక్తమ్"** అని చెప్పబడింది.

**"పురుషస్య హరే స్సూక్తం స్వర్గ్యం ధన్యం యశస్కరమ్, శ్రుతిషు ప్రబలా మంత్రాః తేష్వప్యధ్యాత్మవాదినః, తత్రాపి పౌరుషం సూక్తం న తస్మాత్ విద్యతే పరమ్"** (పురుషుడైన హరియొక్క సూక్తం స్వర్గాన్ని పొందిస్తుంది. గొప్పది కీర్తిని కల్గిస్తుంది. వేదాలలో మంత్రాలు గొప్పవి. వాటిలో కూడా పరమాత్మను తెలిపేవి గొప్పవి. వాటిలో పురుషసూక్తం గొప్పతనాన్ని కల్గినది. దానికంటె మించినది ఇంకొకటి లేదు) అని, శౌనకస్మృతిలో **"న విష్ణ్వారాధనాత్ పుణ్యం విద్యతే కర్మ వైదికమ్, తస్మాదనాదిమధ్యాంతం నిత్యమారాధయేత్ హరిమ్, తద్విష్ణోరితి మంత్రేణ సూక్తేన పౌరుషేణచ, తా తస్య తదృచోమంత్రః వేదేషూక్తః చతుర్ష్వపి** (విష్ణువును ఆరాధించడం కంటే పుణ్యమైన వైదిక కర్మ ఇంకొకటి లేదు. అందువల్ల **"తద్విష్ణోః పరమం పదమ్"** అనే మంత్రంతోనూ, పురుషసూక్తంతోనూ ఆదిమధ్యాంతరహితుడైన హరిని ప్రతిదినం ఆరాధించాలి. దానితో సమానమైన మంత్రం నాల్గువేదాలలోను లేదు) అని ఉద్ఘోషింపబడింది. విష్ణుస్మృతిలో కూడా **"వాసుదేవం సమర్చయేత్"** (వాసుదేవుని అర్చించాలి) అని ఆరంభించి, **"ఏవమభ్యర్చ్య తు జపేత్ సూక్తం వై పౌరుషం తతః"** (ఈ

విధంగా ఆరాధించి, పురుషసూక్తాన్ని జపించాలి) అని చెప్పబడింది. వాధూలసూత్రంలో **"యత్ర యత్ర కర్మప్రేక్షో జాయతే తత్ర తత్ర పురుషం ధ్యాయన్ పురుషసూక్తం జపేదర్చయేత్, పూర్ణత్వాత్ పురుషః"** (కర్మభ్రంశం కల్గినపుడు పురుషుని ధ్యానించి, పురుషసూక్తాన్ని జపించి, ఆరాధించాలి. పూర్ణుడైనందున పురుషుడనబడుతున్నాడు) అని పురుషసూక్తం యొక్క గొప్పతనం చెప్పబడింది. ఈవిధంగా పలువేల చోట్ల పురుషసూక్తంలో ప్రతిపాదింపబడేవాడు నారాయణుడే - అని చెప్పబడింది. ఇతిహాసపురాణాలలోను పలు పలు చోట్ల ఇది భగవత్పరమని చెప్పబడింది. సారంగా కొన్నిమాత్రం ప్రస్తావింపబడుతున్నాయి. మహాభారతంలోని మోక్షధర్మంలో **"బహవః పురుషా రాజన్! ఉదాహో ఏక ఏవ తు, కో హ్యత్ర పురుషః శ్రేష్ఠః కో వా యోని రిహోచ్యతే"** (బ్రాహ్మణా! పురుషులు పలువురా? లేక, ఒకడేనా? పలువురైతే, వీరిలో ఏ పురుషుడు గొప్పవాడు. ఎవడు మిగిలిన వారికి కారణమైన ఉన్నాడు?) అని జనమేజయుడు వైశంపాయనుని అడిగాడు. వైశంపాయనుడు తాము చెప్పబోయే విషయం అతిరహస్యమైనందున తన గురువైన వ్యాసుని నమస్కరించి, **"బహవః పురుషా రాజన్! సాంఖ్యయోగవిచారిణామ్, నైతదిచ్ఛంతి పురుషమేకం కురుకులోద్వహ!, బహూనాం పురుషాణాం చ యదైకో యో నిరుచ్యతే, తదా తం పురుషవ్యాఘ్రం వ్యాఖ్యాస్యామి గుణాధికమ్, ఇదం పురుషసూక్తం హి సర్వవేదేషు పార్థివ, ఋతం సత్యం చ విఖ్యాతం ఋషిసింహేన చిన్తితమ్"** (కురుకులశ్రేష్ఠుడవైన రాజా! జ్ఞానులు, యోగులు అయినవారు పురుషులు పలువురని నిర్ణయించారు. ఒకే దేవపురుషుడని వారు అంగీకరించరు. పలువురు పురుషులకు కారణమైనవాడు, గుణాలలో గొప్పవాడైన పురుషశ్రేష్ఠునిగూర్చి పల్కుతాను విను. ఋషిశ్రేష్ఠులచే సాక్షాత్కరింపబడ్డ ఈ పురుషసూక్తం అన్ని వేదాలలోని సత్యాన్ని తెల్పుతున్నదిగా కీర్తింపబడింది) అని అద్వైతనిరసనాన్ని చేసి, పురుషసూక్తమే కారణపురుషుని తెల్పుతున్నదని పల్కి, 'పురుషోత్తముడు ఎవరు?' అనే విషయాన్ని నిర్ణయం చేయడం కోసం బ్రహ్మకు, రుద్రునకు, మధ్య జరిగిన

ఒక సంభాషణను ప్రస్తావించాడు.

పూర్వం ఒకానొక సమయంలో పాలకడలి మధ్యలో ఉండే వైజయంతమనే పర్వతంలో బ్రహ్మ తపస్సు చేస్తూ ఉండగా, శివుడు తన తండ్రి అయిన బ్రహ్మను సేవించి, పలువురు పురుషులను సృష్టించే నీవు ఏ పురుషుని ధ్యానిస్తున్నావు? అని ప్రశ్నించాడు. అపుడు బ్రహ్మ- **"శృణు పుత్ర! యథా హ్యేష పురుషః శాశ్వతోవ్యయః, న స శక్య స్త్వయా ద్రష్టుం మయాన్యై ర్వాపి సత్తమ, మయాంతరాత్మా తవ చ యే చాన్యే దేహిసంజ్ఞితాః, విశ్వమూర్ధా విశ్వభుజః విశ్వపాదాక్షినాసికః, మహాపురుషశబ్దం. స బిభ్రత్యేక స్సనాతనః, న హి నారాయణో జ్ఞేయః సర్వాత్మా పురుషో హి నః"** (పుత్రా! నిత్యుడు, నాశం లేనివాడైన పురుషుని గూర్చి విను. అతనిని దర్శించడం నీకు, నాకు ఎవరికి వీలు కాదు. అతడు నీకు, నాకు, అందఱికి అంతరాత్మ. అతడు వేయి శిరస్సులను, పాదాలను, భుజాలను, నేత్రాలను, నాసికలను కలవాడు, సనాతనుడైన అతడే మహాపురుషశబ్దాన్ని కలవాడు. అతనిని నారాయణుడని తెలిసికో. సర్వాంతరాత్మ అయిన అతడే పురుషుడు) అని పురుషసూక్తంతో చెప్పబడినవాడు పరమాత్మ అయిన నారాయణుడే - అని స్పష్టంగా తెలిపాడు. విష్ణుపురాణంలో ధ్రువుడు ఈ విషయాన్ని వివరించాడు. ఇంతేకాక, హరివంశంలో కైలాసయాత్ర సందర్భంలో రుద్రుడు ఉమాదేవితో కలసి చేతులను జోడించి, భగవానుని ఉద్దేశించి **"సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్, సహస్రోదరబాహుశ్చ సమస్తాత్మా దివస్పతిః"** ఇత్యాది శ్లోకాలతో స్తోత్రం చేసినందున పురుషసూక్తం. నారాయణునే తెల్పుతున్నదని సిద్ధిస్తున్నది. మోక్షధర్మంలో ముప్పైమూడవ అధ్యాయంలో భీష్ముని యుధిష్ఠిరుడు **"నారాయణం హృషీకేశం గోవింద మపరాజితమ్, తత్త్వేన భరతశ్రేష్ఠ! శ్రోతు మిచ్ఛామి కేశవమ్"** (భరతకులంలో గొప్పవాడా! ఎవరిచేత జయింపబడనివాడు, గోవిందుడు, హృషీకేశుడు, కేశవుడనే పేరును కలవాడు అయిన నారాయణుని యథార్థంగా తెలిసికొనగోరుతున్నాను) అని ప్రశ్నించగా, **"కేశవో భరత శ్రేష్ఠ! భగవానీశ్వరః ప్రభుః, పురుష స్సర్వ మిత్యేవ శ్రూయతే బహుధా విభుః,**

బ్రాహ్మణానాం శతం జ్యేష్ఠం ముఖాదస్యాసృజత్ ప్రభుః" (భారతశ్రేష్ఠా! ప్రభువు, భగవానుడైన కేశవుడే సర్వేశ్వరుడు. సర్వవ్యాపి అయిన ఆ పురుషుడే సర్వమని పలు విధాలుగా చెప్పబడుతున్నాడు. ప్రభువైన ఇతడే తన ముఖంనుండి ఉన్నతులైన నూఱు మంచి బ్రాహ్మణులను సృష్టించాడు) ఇత్యాది శ్లోకాలతో ఈ విషయం చక్కగా వివరించబడింది. రామాయణంలో, భాగవతంలో, గీతలో, మిగిలిన పురాణాలలో పురుషసూక్తం నారాయణునే పరమాత్మగా ఉద్ఘోషిస్తున్నదని చెప్పబడింది. దీనిని వివరంగా పల్కితే మహాభారతం అవుతుంది. అందుచేత ఈ విషయం ఇంతటితో విరమింపబడుతున్నది.

కూరేశులు శ్రీవైకుంఠస్తవంలో - "యం భూతభవ్యభవదీశ మనీశమాహుః అంతఃసముద్రనిలయం యమనంతరూపమ్, యస్య త్రిలోకజననీ మహిషీ చ లక్ష్మీః సాక్షాత్ స ఏవ పురుషోసి సహస్రమూర్ధా, సర్వశ్రుతిష్వనుగతం స్థిర మప్రకంప్యం నారాయణాహ్వయధరం త్వమివానవద్యమ్, సూక్తంతు పౌరుషమశేష జగత్ పవిత్రం త్వా ముత్తమం పురుష మీశ ముదాజహార" (మూడు కాలాలలోని వస్తువులకు ప్రభువు అని, తనకు ఇంకొక ప్రభువు లేనివాడని, పాలసముద్రంలో శయనించి ఉండేవాడని, అపరిమితమైన అవతారరూపాలను కలవాడని, ముల్లోకాలకు తల్లి అయినలక్ష్మిని పత్నిగా కలవాడని చెప్పబడిన నీవే వేయి శిరస్సులను కల పురుషుడవు. నీవలె, అన్ని శ్రుతులలో ఉద్ఘోషింపబడినది, స్థిరమైనది, అవిచాల్యమైనది, నారాయణమనే పేరును కల్గినది, దోషం లేనిది, లోకాన్ని అంతటిని పవిత్రం చేసేది అయిన పురుషసూక్తం, నిన్నే గొప్పవాడైన పురుషునిగా, ఈశ్వరునిగా పల్కుతున్నది) అని పురుషసూక్తం యొక్క గొప్పతనాన్ని, అర్థాన్ని సంగ్రహిస్తూ పలికారు. పెరియవాచ్చాన్‌పిళ్ళై తిరువాయ్‌మొழி వ్యాఖ్యానంలో చివరలో "శ్రీమానాన నారాయణనే ప్రాప్యముమ్, ప్రాపకముమ్ ఎన్ఱు ఇవర్‌క్కు పక్షమెన్ఱుమిడమ్ తోన్ఱిన్ఱు. ఇవ్వర్థమ్ ఉపనిషత్ ప్రసిద్ధముమ్, అనన్యపరమాన నారాయణానువాకత్తిలే నారాయణశబ్దార్థత్తాలే సర్వాధికనై చ్చొల్లి, హ్రీశ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ- ఎన్ఱు ఉత్తర నారాయణత్తే శొల్లుకిఱదు" (లక్ష్మిని కలవాడైన

నారాయణుడే ప్రాప్యం, ప్రాపకం అనేది నమ్మాళ్వార్లకు సిద్ధాంతమని తోస్తున్నది. ఈ అర్థం ఉపనిషత్తులలో ప్రసిద్ధం. నారాయణునిమాత్రమే తేలిపే నారాయణానువాకంలో నారాయణ శబ్దార్థంతో సర్వాధికుడైన పరమాత్మను తెలిపి 'హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ' అని ఉత్తర నారయణం లో తెలుపబడింది) అని పలికారు.

ఈ పురుషసూక్తంలో శ్రీభూమినాథుడైన నారాయణుడే పరమాత్మ అని, అతడే చతుర్ముఖుని సృష్టించాడని, అతడే సర్వకారణభూతుడని, సర్వాంతర్యామి అని, లోక సంరక్షణార్థం పలు అవతారాలను ఎత్తుతాడని, నిత్యవిభూతి నారాయణుడని నిర్ణయింపబడినది. పురుషసూక్తమనే పేరువల్లనే స్తోత అయిన జీవాత్మ ఉన్నాడని, సత్త్వప్రియుడైన మహాపురుషుడున్నాడని, స్తోత్రం కూడా వాస్తవమని తెలుపబడుతున్నది. జ్ఞాత, జ్ఞేయం, జ్ఞానం - అనే మూడు లేవు - అనే అద్వైతవాదం ఇక్కడ అంగీకరింపబడలేదు. 'లోకం మిథ్య' అనే భ్రమవాదానికి ఇక్కడ వివరంగా చెప్పబడ్డ సృష్టి క్రమంలో చోటు ఉన్నదా? పరమపురుషునకు వేయి నేత్రాలు, వేయి తలలు - అని, అతడు ఆదిత్యవర్ణుడని, నక్షత్రాలవలె రూపాన్ని కలవాడని, అశ్వినీదేవతలవలె అందమైనవాడని చెప్పబడినందున "రూపం లేదు'' అనే వాదం వ్యర్థవాదమని స్ఫురిస్తున్నది. చేతనులు, నిత్యులు, ముక్తులు, బద్ధులని మూడు విధాలైనవారని, మోక్షాన్ని ఇచ్చేవాడు ముకుందుడే- అని చూపబడింది. కాలం కూడా భవిష్యత్ వర్తమాన భూతాలనే మూడు భేదాలను కల్గినదని తెలుస్తున్నది. పురుషోత్తముని మహిమ వాక్కుకు, మనస్సుకు అందనిదని తెలుపబడుతున్నది. పురుషోత్తముడు సమస్తకల్యాణగుణాలతో నిండినవాడని, హేయగుణాలు లేశంకూడా లేనివాడని, సులభంగా, ఆరాధించదగినవాడని ఉద్ఘోషింపబడినందున గుణం లేదు - అనే వాదానికి కొంచెం కూడా అవకాశం లేదు. ప్రకృతికి ఆవల వైపున ఉన్నది, **"విష్ణోర్యత్ పరమం పదమ్"** అని చెప్పబడేది అయిన స్థానవిశేషం ఒకటి ఉన్నదని, దానిని పొందడమే మోక్షమని వివరంగా చెప్పబడింది. భగవత్కైంకర్యమే

పరమపురుషార్థమని, అదికూడా దివ్యదంపతులిరువురి చేరికలో చేయబడాలని తెలిపే శ్రీవైష్ణవసిద్ధాంతం ఇక్కడ అంగీకరింపబడింది. అందువల్ల విశిష్టాద్వైతమే వేదాంతరహస్యార్థమనే సిద్ధాంతం పురుషసూక్తంలో స్థాపింపబడింది.

పంచవింశార్చకం సూక్తం శ్రీవిష్ణు విభవాత్మకమ్ ।
వ్యాకరోత్ పౌరుషం భక్త్యా శింగరార్యో యథామతి ॥

సర్వేత్ర విహితా దోషా మయాజ్ఞానాత్ ప్రమాదతః ।
తే సర్వే హంసవిబుధైః వర్జనీయా కృపాభరైః ॥

## పురుషసూక్త వ్యాఖ్యానం సంపూర్ణం



# *అనుబంధం - 1*

# అహిర్బుధ్న్యసంహిత 59వ అధ్యాయంలోని పురుషసూక్త మంత్రార్థ నిరూపణ శ్లోకాలు

అహిర్బుధ్న్య ఉవాచ -

సూక్తం తు పౌరుషం పుంసః పరస్మాదుత్థితం పురా,
జగద్ధితాయ లక్ష్మ్యా శ్చ శ్రీసూక్తం తత్ సముద్గతమ్,
నానాభేదప్రపాఠం తత్పౌరుషం సూక్తముచ్యతే,
ఋచ శ్చతస్రః కేచిత్తు పంచ షట్ సప్త చాపరే,
ఋచః షోడశ చాప్యంతే తథాష్టాదశ చాపరే
అధీయతే తు పుంసూక్తం ప్రతిశాఖం తు భేదతః,
సమస్తజగదుత్పత్తిహేతు స్స్వర్గాపవర్గదః,
పౌరుషో మానుషో యజ్ఞః సూక్తేఽస్మిన్ ప్రతిపాద్యతే,
తత్రాద్యాభిః చతసృభిః చాతురాత్మ్యం వివిచ్యతే,
యః పరః పుండరీకాక్షః పరమాత్మా సనాతనః,
యా చ సా జగతాం యోనిః లక్ష్మీః తద్ధర్మచారిణీ,
సహస్రా సహగా యస్య సహభావ ముపేయుషీ,
శ్రీర్నామ పరమా శక్తిః పూర్ణషాడ్గుణ్యావిగ్రహా,
నిస్సక్తాసక్తకో యస్య నిత్యం సన్ సకలాశ్రయః,
సహస్రశీర్ష ఇత్యేవం భగవాన్ పరిగీయతే,

1అనుబంధం – 1

పూర్ణత్వాత్ పురుషో నిత్యం పృణాతేః పూరణార్థకాత్,
అశ్నుతే రథవాశ్నాతే రక్షోఽ జేరంచతే రుత,
అక్షః పురుష ఉద్దిష్టో యః ప్రకృత్యాశ్రితో విభుః,
పద్యతేః పరిణామార్థాత్ పదిత్యేష నిరుచ్యతే,
పాదితి ప్రకృతిః ప్రోక్తా సా నిత్యపరిణామినీ,
షణ్ణాం గుణానాం మధ్యే యా శక్తిః సాహస్ర ఉచ్యతే,
ప్రధానపురుషౌ తస్యాః సృతౌ సర్గే సనాతనౌ,
తామేవాపి శ్రితావంతే తౌ సహస్రావతః స్మృతౌ,
సహస్రపురుషావ్యక్తః సహస్రాక్షః సహస్రపాత్,
స భూమిం విశ్వతో వృత్వేత్యేతేనైవ నిరుచ్యతే,
యదతీత్య సృతం విశ్వం నానాసత్తాత్మనః స్థితిః,
కార్యే హి కారణేయత్తా పయసో దధిసంభవే,
కార్యం యత్ సంతతౌ క్వాపి కార్యే యత్త్రైవ కారణే,
మధూచ్ఛిష్టమయే పిండే యథాఽఽకారవియోగిని,
నైవం భగవతః సర్గే ప్రతిసరేఽపి చాసతి,
కార్యేయత్తాత్వమస్తీతి స భూమిమితి వర్ణ్యతే,
భగవత్యార్జితానీతి శుద్ధాశుద్ధమయాని చ,
భూమి జగదుపాదానం భూమిశక్తి రిహోచ్యతే,
శుద్ధాశుద్ధవిభాగో యః కాలపుంప్రకృతిస్థితః,
స భూమిం విశ్వతో వృత్వా విష్టభ్య స్వేన తేజసా,
స్వసంకల్పస్వరూపేణ ప్రభవాప్యయవేళయోః,
అత్యతిష్ఠదతీత్యైవ స్థితో భూయో దశాంగుళమ్,
దశాంగుళిభి రానంత్యం కారణస్యోపదిశ్యతే,
అథ సంకర్షణావస్థా జగద్ధేతుః నిరూప్యతే,
యదిదం దృశ్యతే విశ్వం భూతభవ్యాత్మరూపకమ్,
ఇదం పురుష ఏవాదౌ సిసృక్షాయామాభూత్కిల,

పురుషః స్యందతి వ్యక్తం సమ్యగ్విజ్ఞానయోజనాత్,
అతః పురుష ఇత్యేవం సంకర్షణ ఉదీర్యతే,
తిలకాలకవద్విశ్వం బిభ్రచ్చిదచిదాత్మకమ్,
సంకర్షణ ఉదేతి స్మ స ఏవం పునరుచ్యతే,
ఉతామృతత్వస్యేశాన ఇతి తస్యార్థ ఉచ్యతే,
అన్నేన భోగ్యభూతేన ప్రకృతిప్రాకృతాత్మనా,
కాలసంకలితేనైవ నానాఽఽకారవిధా జుషా,
అచిదంశేన జీవాత్మా యశ్చిదంశోఽధిరోహతి,
స్వస్థాసంబంధపూర్వం యః పూర్వసంగవశాదిహ,
తస్య సద్గుణసంసర్గాత్ నానాబంధక్షయే సతి,
అమృతత్వం స్వరూపావి ర్భావమోక్షాపరాహ్వయమ్,
తస్య సంకర్షణో దేవ ఈశానో జ్ఞానదేశనాత్,
సంసారానలసంతప్తచేతనానుజిఘృక్షయా,
సంకర్షణాదయో విష్ణురుచ్యతేఽథ తృతీయయా,
ఏతావానస్య మహిమా విష్ణోః సంకర్షణాత్మనః,
యదయం ఘృతవిన్ విశ్వం సమున్మీలనమాదిమమ్,
జ్యాయానతోఽపి పురుషః ప్రద్యుమ్న ఉపకారతః,
పురూ ప్రకృతిపురుషౌ పురుషః సృజతీతి యత్,
విశ్వోపకారచేష్టాభిః జ్యాయస్త్వం తస్య వర్ణ్యతే,
ఋచా తృతీయయా సూక్తేః త్రిపాదూర్ధ్వ ఉదైదితి,
దేవోఽపరిమితేహ స్సన్నిరుద్ధో నిరూప్యతే,
పురా సీదతి కార్యాణి కారయన్ ప్రాణినోఽఖిలాన్,
ఫలాని పురుషేభ్యశ్చ సనోతి క్రియయాఽఽర్చితః,
తతః పురుష ఇత్యేవ మనిరుద్ధోఽభిధీయతే,
పురి సన్ సన్ పురీవాయం పురాదూర్ధ్వ ముదైత్ పురాత్,
తదవస్థేన నాఘ్రాత మిత్యర్థో ఽయమిహోచ్యతే,

పాదోఽ స్యైకాంశ ఏవేహ చేతనాచేతనాత్మకమ్,
అంతర్యామితయా వ్యాప్తిః తత్తాన్నియమనేచ్ఛయా,
ఏతదేవ వ్యనక్తీహ తతో విష్వఙ్ఙితి తృచా,
విష్వక్సమంతతో భూత్వా, వ్యక్రామత్ ప్రావిశత్ బహు,
సాశనానశనే ప్రోక్తే చేతనాచేతనే ఉభే,
తస్మాద్విరాడితి ప్రోక్తా విరాడ్విద్యా పరాహ్వయా,
హిరణ్యగర్భో విశ్వాత్మా స పూరుష ఇహోచ్యతే
శేషం తు లోకతః సిద్ధమిత్యయం సూక్త ఈదృశః.



# అనుబంధం - 2

# పురుషసూక్తార్థాన్ని వివరించే ముద్గలోపనిషత్తు

పురుషోత్తమవిఖ్యాతం పూర్ణం బ్రహ్మ భవామ్యహమ్,
ఓమ. వాఙ్మే మనసి ప్రతిష్ఠితా మనో వాచి ప్రతిష్ఠితమ్.
మనో మే వాచి ప్రతిష్ఠితమ్, ఆవిరావీర్మ ఏధి,
వేదస్య మ ఆణీస్థః, శ్రుతం మే మా ప్రహాసీరనేనాధీతేనాహోరాత్రాన్ సందధామ్యృతమ్ వదిష్యామి సత్యం వదిష్యామి.
తన్మామవతు తద్వక్తారమవతు, అవతు మామ్, అవతు వక్తారమ్. అవతు వక్తారమ్.

ఓమ్. పురుషసూక్తార్థనిర్ణయం వ్యాఖ్యాస్యామః.
పురుషసంహితాయాం పురుషసూక్తార్థం సంగ్రహేణ ప్రోచ్యతే.

సహస్ర శీర్షేత్యత్ర సశబ్దోఽనంతవాచకః
అనంతయోజనం ప్రాహ దశాంగులవచ స్తథా,
తస్య ప్రథమయా విష్ణోః దేశతో వ్యాప్తిరీరితా,
ద్వితీయయా చాస్య విష్ణోః దేశతో వ్యాప్తిరుచ్యతే,
విష్ణోః మోక్షప్రదత్వం చ కథితం తు తృతీయయా,
ఏతావానితి మంత్రేణ వైభవం కథితం హరేః,
ఏతేనైవ చ మంత్రేణ చతుర్వ్యూహో విభాషితః,
త్రిపాదిత్యనయా ప్రోక్త మనిరుద్ధస్య వైభవమ్,
తస్మాద్విరాడిత్యనయా పాదనారాయణాద్ధరేః,

ప్రకృతేః పురుషస్యాపి సముత్పత్తిః ప్రదర్శితా,
యత్పురుషేణేత్యనయా సృష్టియజ్ఞః సమీరితః,
సప్తాస్యాసన్ పరిధయః సమిధశ్చ సమీరితాః,
తం యజ్ఞమితి మంత్రేణ సృష్టియజ్ఞః సమీరితః,
అనేనైవ చ మంత్రేణ మోక్షశ్చ సముదీరితః,
తస్మాదితి చ మంత్రేణ జగత్సృష్టిః సమీరితా,
వేదాహమితి మంత్రాభ్యాం వైభవం కథితం హరేః,
యజ్ఞేనేత్యుపసంహారః సృష్టేః మోక్షస్య చేరితః,
య ఏవమేతత్ జానాతి స హి ముక్తో భవేదితి.

అథ తథా ముద్గలోపనిషది పురుషసూక్తస్య వైభవమ్ విస్తరేణ ప్రతిపాదితమ్. వాసుదేవ ఇంద్రాయ భగవద్జ్ఞాన ముపదిశ్య పునరపి సూక్ష్మమశ్రవణాయ ప్రణతాయేంద్రాయ పరమరహస్యభూతం పురుషసూక్తాభ్యాం ఖండద్వయాభ్యా ముపాదిశత్.

ద్వౌ ఖండావుచ్యేతే..యోఽయముక్తః స పురుషో నామరూపజ్ఞాన గోచరం సంసారిణా మతిదుర్ జ్ఞేయం విషమం విహాయ క్లేశాదిభిః సంక్లిష్టదేవాది జిహీర్షయా సహస్రకళావయవకళ్యాణం దృష్టమాత్రేణ మోక్షప్రదం వేషమాదదే. తేన వేషేణ భూమ్యాదిలోకం వ్యాప్యానంతయోజనమధ్యతిష్ఠత్. పురుషో నారాయణో భూతం భవ్యం భవిష్యచ్చాసీత్. స చ సర్వస్మాత్ మహిమ్నో జ్యాయాన్. తస్మాన్న కోఽపి జ్యాయాన్. మహాపురుష ఆత్మానం చతుర్ధా కృత్వా త్రిపాదేన వ్యోమ్ని చాసీత్. ఇతరేణ చతుర్థేన అనిరుద్ధనారాయణేన విశ్వాన్యాసన్. స చ పాదనారాయణో జగత్ స్రష్టుం ప్రకృతి మజనయత్. స సమృద్ధకాయః సన్ సృష్టికర్మ న జజ్ఞివాన్. సోఽనిరుద్ధనారాయణః తస్మై సృష్టిముపాదిశత్. బ్రహ్మన్ తవేంద్రియాణి యాజకాని ధ్యాత్వా, కోశభూతం దృఢం గ్రంథికళేబరం హవిః ధ్యాత్వా, మాం హవిర్భుజం ధ్యాత్వా, వసంతకాలమాజ్యం ధ్యాత్వా, గ్రీష్మమిధ్మం ధ్యాత్వా, శరదృతుం రసం ధ్యాత్వైవమగ్నౌ

హుత్వాంగస్పర్శాత్ కళేవరో వజ్రం హీష్యతే. తతః స్వకార్యాన్ సర్వప్రాణిజీవాన్ సృష్ట్వా పశ్చాద్యాః ప్రాదుర్భవిష్యంతి. తతః స్థావరజంగమాత్మకం జగద్ భవిష్యతి. ఏతేన జీవాత్మనోః యోగేన మోక్షప్రకారశ్చ కథిత ఇత్యనుసంధేయమ్. య ఇమం సృష్టియజ్ఞం జానాతి మోక్షప్రకారం చ సర్వమాయురేతి.

ఏకో దేవో బహుధా నివిష్టః అజాయమానో బహుధా విజాయతే. తమేతమిత్యగ్ని రిత్యధ్వర్యవ ఉపాసతే. యజురిత్యేష హీదం సర్వం యునక్తి. సామేతి ఛందోగాః. ఏతస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్. విషమితి సర్పాః సర్ప ఇతి సర్పవిదః. ఊగితి దేవాః. రయిరితి మనుష్యాః. మాయేత్యసురాః. స్వధేతి పితరః . దేవజన ఇతి దేవజనవిదః. రూపమితి గంధర్వాః. గంధర్వ ఇతి అప్సరసః. తం యథాయథోపాసతే తథైవ భవతి. తస్మాత్ బ్రాహ్మణః పురుషరూపం పరబ్రహ్మైవాహమితి భావయేత్. తద్రూపో భవతి. య ఏవం వేద.

తద్బ్రహ్మ తాపత్రయాతీతం షట్కోశవినిర్ముక్తం షడూర్మివర్జితం పంచకోశాతీతం షడ్భావవికారశూన్యమేవమాదిసర్వవిలక్షణం భవతి. తాపత్రయం త్వధ్యాత్మికాధిభౌతికాధిదైవికం కర్తృకర్మకార్యజ్ఞాతృజ్ఞానజ్ఞేయ భోక్తృభోగభోగ్యమితి త్రివిధమ్. త్వఙ్మాంసశోణితాస్థిస్నాయుమజ్జాః షట్కోశాః. కామక్రోధలోభమోహమదమాత్సర్యాః అరిషడ్వర్గాః. అన్నమయ ప్రాణమయ మనోమయవిజ్ఞానమయానందమయాః ఇతి పంచకోశాః. ప్రియాత్మజనన వర్ధనపరిణామక్షయనాశాః షడ్భావాః. అశనాయాపిపాస శోకమోహజరామరణానీతి షడూర్మయః. కులగోత్రజాతివర్ణాశ్రమరూపాణి షడ్భ్రమాః. ఏతద్యోగేన పరమ పురుషో జీవో భవతి నాన్యః. య ఏతదుపనిషదం నిత్యమధీతే సోఽగ్నిపూతో భవతి. స వాయుపూతో భవతి. ఆదిత్యపూతో భవతి. ఆరోగీ భవతి. శ్రీమాంశ్చ భవతి. పుత్రపుత్రాదిభిః సమృద్ధో భవతి. విద్వాంశ్చ భవతి. మహాపాతకాత్ పూతో భవతి. సురాపానాత్ పూతో భవతి. అగమ్యగమనాత్ పూతో భవతి. మాతృగమనాత్ పూతో భవతి. దుహితృస్నుషాభిగమనాత్ పూతో భవతి. స్వర్ణస్తేయాత్ పూతో భవతి. వేదిజన్మహానాత్ పూతో భవతి. గురోరశుశ్రూషణాత్

పూతో భవతి. అయాజ్యయాజనాత్ పూతో భవతి. భాష అభక్ష్యభక్షణాత్ పూతో భవతి. పరదారాగమనాత్ పూతో భవతి. కామక్రోధలోభమోహేర్ష్యాదిభిరబాధితో భవతి. సర్వేభ్యః పాపేభ్యః ముక్తో భవతి. ఇహ జన్మని పురుషో భవతి. తస్మాదేతత్పురుషార్థమతిరహస్యం రాజగుహ్యం దేవగుహ్యం గుహ్యాదపి గుహ్యతరం నాదీక్షితయోరుపదిశేత్. నానూచానాయ. నాయజ్ఞశీలాయ. నావైష్ణవాయ. నాయోగినే. న బహుభాషిణే. నాప్రియవాదినే. నాసంవత్సరవేదినే. నాతుష్టాయ. నానధీతతవేదాయోపదిశేత్.

గురురప్యేవంవిచ్ఛుచౌ దేశే పుణ్యానక్షత్రే ప్రాణానాయమ్య పురుషం ధ్యాయన్నుపసన్నాయ శిష్యాయ దక్షిణకర్ణే పురుషసూక్తార్థముపదిశేత్ విద్వాన్. న బహుశో వదేత్. యాతయామో భవతి. అసకృత్ కర్ణముపదిశేత్. ఏతత్కుర్వణోఽధ్యేతాధ్యాపకశ్చ ఇహ జన్మని పురుషో భవతీత్యుపనిషత్. ఓమ్. వాఙ్మే మనసి ప్రతిష్ఠితా మనో వాచి ప్రతిష్ఠితమ్.

మనో మే వాచి ప్రతిష్ఠితమ్, ఆవిరావీర్మ ఏధి, వేదస్య మ ఆణీస్థః, శ్రుతం మే మా ప్రహాసీరనేనాధీతేనాహోరాత్రాన్ సందధామ్యృతమ్ వదిష్యామి సత్యం వదిష్యామి.

తన్మామవతు తద్వక్తారమవతు, అవతు మామ్, అవతు వక్తారమ్.అవతు వక్తారమ్. ఓం శాంతిః శాంతిః శాంతిః.

ఇతి ముద్గలోపనిషత్ సమాప్తా.



# అనుబంధం - 3

# పురుషసూక్తార్థాన్ని అనుసంధించే శ్రీవిష్ణుపురాణంలో ధ్రువస్తుతిలోని శ్లోకాలు (ప్రథమాంశం- ద్వాదశాధ్యాయం)

ధ్రువ ఉవాచ:

భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।
భూతాదిరాదిప్రకృతిః యస్య రూపం నతోఽస్మి తమ్ ॥

శుద్ధః సూక్ష్మోఽఖిలవ్యాపీ ప్రధానాత్పరతః పుమాన్ ।
యస్య రూపం నమస్తస్మై పురుషాయ గుణాత్మనే ॥

భూతాదీనాం సమస్తానాం గంగాదీనాం చ శాశ్వతః ।
బుద్ధాదీనాం ప్రధానస్య పురుషస్య చ యః పరః ॥

తం బ్రహ్మభూతమాత్మానమ్ అశేషజగతః పతిమ్ ।
ప్రపద్యే శరణం శుద్ధం త్వద్రూపం పరమేశ్వర ॥

బృహత్త్వాత్ బృంహణత్వాచ్చ యద్రూపం బ్రహ్మ సంజ్ఞితమ్ ।
తస్మై నమస్తే సర్వాత్మన్ యోగిచింత్యావికారిణే ॥

సహస్రశీర్షా పురుషు సహస్రాక్ష సహస్రపాత్ ।
సర్వవ్యాపీ భువః స్పర్శాత్ అత్యతిష్ఠత్ దశాంగులమ్ ॥

యద్భూతం యచ్చ వై భవ్యం పురుషోత్తమ తద్భవాన్ ।
త్వత్తో విరాట్ స్వరాట్ సమ్రాట్ త్వత్తశ్చాప్యధిపూరుషః ॥

అత్యరిచ్యత సోఽధశ్చ తిర్యక్చోర్ధ్వం చ వై విభుః ।
త్వత్తో విశ్వమిదం జాతం త్వత్తో భూతం భవిష్యతి ॥

త్వత్ రూపధారిణశ్చాంతః, సర్వభూతమిదం జగత్ ।
త్వత్తో యజ్ఞస్సర్వహుతః, పృషదాజ్యం పశుర్ద్విధా ॥

త్వత్తో ఋచోఽథ సామాని, త్వత్తశ్ఛందాంసి జజ్ఞిరే! ।
త్వత్తో యజూంషి అజాయంత, త్వత్తో అశ్వాశ్చ ఏకతో దతః ॥

గావః త్వత్తస్సముద్భూతాః, త్వత్తోఽజా అవయో మృగాః ।
త్వన్ముఖాత్ బ్రాహ్మణాః బాహ్వోః, తవ క్షత్రమజాయత ॥

వైశ్యాః తథోరుజాశ్శూద్రాః, తవ పద్భ్యాం సముద్గతాః ।
అక్ష్ణోఃసూర్యోఽనిలః ప్రాణాత్, చంద్రమా మనసస్తవ ॥

ప్రాణోఽతస్సుషిరాత్ జాతో, ముఖాత్ అగ్నిరజాయత ।
నాభితో గగనం ద్యౌశ్చ, శిరసః సమవర్తత ॥

దిశశ్శ్రోత్రాత్ క్షితిః పద్భ్యాం, త్వత్తః సర్వమభూదిదమ్ ॥



## అనుబంధం – 4

## ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి అళ్గగ శింగరాచార్యస్వామి వారి గ్రంథాల పట్టిక:

**(ప్రతులకోసం '9885460460–రామన్' ను సంప్రదించగలరు)**

1. శ్రీరఙ్గరాజస్తవము – పూర్వశతకము (వరివస్యా వ్యాఖ్యానంతో), 2. ఉజ్జ్వలవేఙ్కటనాథస్తోత్రము – సవ్యాఖ్యానము, 3. శ్రీస్తవము – సవ్యాఖ్యానము, 4. అతిమానుషస్తవము – సవ్యాఖ్యానము, 5. సున్దరబాహుస్తవము – సవ్యాఖ్యానము, 6. పాశురప్పడి రామాయణము – తెలుగు అనువాదం, 7. కూరేశుల పఞ్చస్తవి – అర్థతాత్పర్యాలతో, 8. శ్రీరామానుజ సహస్రనామస్తోత్రము – అనువాదంతో, 9. శ్రీబాలగోపాల మఙ్గలాశాసనము – సవ్యాఖ్యానము, 10. శ్రీసుదర్శన శతకము – అర్థతాత్పర్యాలతో, 11. గరుడదండకము – సవ్యాఖ్యానము, 12. రఘువీర గద్యము – అర్థతాత్పర్యాలతో, 13. శ్రీ నృసింహ స్తుతి స్తబకం – ఆంధ్రానువాదం, 14. శ్రీరఙ్గనాథుని అభిషేక చూర్ణికలు – తెలుగు అనువాదం, 15. శ్రీరఙ్గనాథస్తోత్రము – సవ్యాఖ్యానము, 16. శ్రీరఙ్గరాజవింశతి – సవ్యాఖ్యానము, 17. శ్రీరఙ్గనాథసుప్రభాతము – సవ్యాఖ్యానము, 18. శ్రీరఙ్గనాథప్రపత్తి – సవ్యాఖ్యానము, 19. శ్రీరఙ్గనాథ మఙ్గలాశాసనము – సవ్యాఖ్యానము, 20. పూర్వదినచర్య, ఉత్తరదినచర్య – సవ్యాఖ్యానము, 21. అభీతిస్తవము – సవ్యాఖ్యానము, 22. శ్రీయామునుల చతుశ్శ్లోకీ – సవ్యాఖ్యానము, 23. శ్రీవరవరముని సుప్రభాతము – సవ్యాఖ్యానము, 24. శ్రీవరవరముని ప్రపత్తి – సవ్యాఖ్యానము, 25. శ్రీవరవరముని మఙ్గలమ్ – సవ్యాఖ్యానము, 26. శ్రీవేఙ్కటేశ సుప్రభాతము – సవ్యాఖ్యానము, 27. శ్రీవేఙ్కటేశ ప్రపత్తి – సవ్యాఖ్యానము, 28. శ్రీవేఙ్కటేశ స్తోత్రము – సవ్యాఖ్యానము, 29. శ్రీవేఙ్కటేశ మఙ్గలాశాసనము – సవ్యాఖ్యానము, 30. ప్రార్థనా పఞ్చకము – సవ్యాఖ్యానము, 31. 'ప్రయాణకాలే' ఇత్యాది శ్లోక వ్యాఖ్యాన అనువాదము, 32. శ్రీయతిరాజవైభవము – తెలుగు అనువాదము, 33. ధాటీ పఞ్చకము – సవ్యాఖ్యానము, 34. శ్రీరామానుజ సుప్రభాతము – సవ్యాఖ్యానము, 35. శ్రీభాష్యకార మఙ్గలము – సవ్యాఖ్యానము, 36. శ్రీరామానుజ ప్రపత్తి – సవ్యాఖ్యానము,

37. శ్రీవరవరముని సుచరిత చషకము - తెలుగు అనువాదము, 38. పొదుత్తనియన్ల వ్యాఖ్యానము - తెలుగు అనువాదము, 39. శ్రీకూరేశవింశతి - సవ్యాఖ్యానము, 40. శ్రీవేఙ్కటేశ్వరాష్టోత్తర శతనామస్తోత్రము - సవ్యాఖ్యానము, 41. శ్రీకూరనాథ పఞ్చాశత్ - సవ్యాఖ్యానము, 42. కరుణాలహరి - సవ్యాఖ్యానము, 43. శ్రీగోపికాగీతా వ్యాఖ్యానము - ఆంధ్రానువాదము, 44. భూసూక్తవ్యాఖ్యానము, 45. నీళాసూక్త వ్యాఖ్యానము, 46. శ్రీసూక్తవ్యాఖ్యానము, 47. ద్వయోపనిషత్ వ్యాఖ్యానము, 48. సుదర్శనోపనిషత్ - ఆంధ్రీకరణము, 49. కాత్యాయనోపనిషత్ - ఆంధ్రీకరణము, 50. వరాహోపనిషత్ - ఆంధ్రీకరణము, 51. ఉభయ వేదాంతములు బ్రహ్మవిద్యలు, 52. భగవన్నామ వైభవము, 53. వాక్యగురుపరంపరా వ్యాఖ్యానము - ఆంధ్రానువాదము, 54. తిరుక్కచ్చినమ్బి వైభవము, 55. దేవరాజాష్టకము - సవ్యాఖ్యానము, 56. శ్రీకూరేశగాథా-మృతలహరి, 57. శఠకోపరన్దాది - సవ్యాఖ్యానము, 58. ఇరామన్ నమదరణే - సవ్యాఖ్యానము, 59. అమృతరంజని - సవ్యాఖ్యానము, 60. అధికార సంగ్రహము - సవ్యాఖ్యానము, 61. అమృతాస్వాదినీ - సవ్యాఖ్యానము, 62. పరమపదసోపానము - సవ్యాఖ్యానము, 63. పిళ్ళై అన్దాది - సవ్యాఖ్యానము, 64. శెయ్యతామరైత్తాళిణై పాశుర వ్యాఖ్యానము - అనువాదము, 65. శ్రీమణవాళమామునికళ్ నూఱ్ఱన్దాది - సవ్యాఖ్యానము, 66. శ్రీఉడైయవర్ తిరుమఞ్జన కట్టియమ్ - అనువాదము, 67. శ్రీవేఙ్కటేశ దివ్యసాహితీ, 68. శిఱియతిరుమడల్ - సవ్యాఖ్యానము, 69. అమలనాదిపిరాన్ - సవ్యాఖ్యానము, 70. తిరుప్పావై - సంగ్రహవ్యాఖ్యానము, 71. తిరువెழுకూఱ్ఱిరుక్కై - సవ్యాఖ్యానము, 72. దివ్యసూరిసూక్తి వైభవము, 73.దివ్యసూరిసూక్తి సుధ, 74. నాచ్చియార్ తిరుమొழி - తెలుగు టీక, 75. పెరుమాళ్ తిరుమొழி - సవ్యాఖ్యానము, 76. తిరుచ్ఛన్దవిరుత్తమ్ - టీకా, తాత్పర్యాలతో, 77. తిరువాశిరియమ్ - సవ్యాఖ్యానము, 78. పెరియతిరుమడల్ వ్యాఖ్యానము, 79. శ్రీమణవాళమామునుల అమలనాదిపిరాన్ వ్యాఖ్యానము, 80. శ్రీమణవాళమామునుల కణ్ణినుణ్శిఱుత్తామ్బు వ్యాఖ్యానము, 81. శ్రీశైలవైభవము - సవ్యాఖ్యానము, 82. సంప్రదాయ చన్ద్రిక - సవ్యాఖ్యానము, 83. ఉపదేశరత్తినమాలై - వ్యాఖ్యానానువాదము,, 84. శ్రీచరమగురునిర్ణయము - అనువాదము,, 85. శ్రీఅష్టభుజాష్టకము - సవ్యాఖ్యానము, 86. శ్రీయథోక్తకారి వైభవము, 87. పన్నిరునామమ్ - అనువాదము, 88.

ఆమతేవనారై పఱ్ఱు నెఞ్జే కూరుమత్తే - సవ్యాఖ్యానము, 89. గోదాస్తుతి - టీకా తాత్పర్యాలతో, 90. ఇరామానుశనూఱ్ఱన్దాది - దివ్యార్థదీపికా-అనువాదము, 91. పరమార్థస్తుతి - సవ్యాఖ్యానము, 92. వైరాగ్యపంచకం - సవ్యాఖ్యానము, 93. న్యాసదశకం - సవ్యాఖ్యానము, 94. పెరియతిరువన్దాది - సవ్యాఖ్యానము, 95. దశావతారస్తోత్రం - సవ్యాఖ్యానము, 96. నడాధూర్ అమ్మాళ్ వైభవం - ఆంధ్రానువాదం 97. నమ్బెరుమాళ్ తిరుమఞ్జనకట్టియజ్గళ్, 98. యతిరాజవింశతి - తాత్పర్యంతో (ఆళ్వార్ దివ్యప్రబంధప్రాజెక్ట్ ప్రచురణ), 99. స్తోత్రరత్నం - తాత్పర్యంతో (ఆళ్వార్ దివ్యప్రబంధప్రాజెక్ట్ ప్రచురణ), 100. ముకుందమాల - తాత్పర్యంతో (ఆళ్వార్ దివ్యప్రబంధప్రాజెక్ట్ ప్రచురణ), 101. గీతార్థసంగ్రహము - తాత్పర్యంతో (ఆళ్వార్ దివ్యప్రబంధప్రాజెక్ట్ ప్రచురణ), 102. శ్రీహయగ్రీవస్తోత్రము - టీకా తాత్పర్యాలతో (ఆళ్వార్ దివ్యప్రబంధ ప్రాజెక్ట్ ప్రచురణ), 103. శ్రీసుదర్శనాష్టకమ్ - టీకా తాత్పర్యాలతో (ఆళ్వార్ దివ్యప్రబంధప్రాజెక్ట్ ప్రచురణ), 104. శ్రీషోడశాయుధ స్తోత్రము - టీకా తాత్పర్యాలతో (ఆళ్వార్ దివ్యప్రబంధప్రాజెక్ట్ ప్రచురణ), 105. లక్ష్మీగద్యం - వివరణతో (ఆళ్వార్ దివ్యప్రబంధప్రాజెక్ట్ ప్రచురణ), 106. శరణాగతి గద్య - వివరణతో (ఆళ్వార్ దివ్యప్రబంధప్రాజెక్ట్ ప్రచురణ), 107. తిరుక్కురున్దాండకమ్ - సవ్యాఖ్యానము, 108. కిడాంబి ఆచ్చాన్ వైభవం, 109. నిగమనప్పడి - అనువాదము, 110. క్షమాషోడశి - సవ్యాఖ్యానము, 111. నంజీయర్ వైభవం, 112. తిరుప్పల్లాండు వ్యాఖ్యానమ్, 113. తిరుప్పళ్లియెழுచ్చి వ్యాఖ్యానమ్, 114. శ్రీవరవరమునిశతకమ్ (ప్రతివాదిభయంకరమ్ అణ్ణన్ ప్రణీతమ్) వ్యాఖ్యానమ్, 115. ఎమ్బార్ వైభవం, 116. శ్రీనివాసగద్యమ్, లక్ష్మీగద్యమ్ - వ్యాఖ్యానమ్, 117. తిరుప్పావై దివ్యార్థ సౌరభం, 118. ఆదిత్యహృదయం - సవ్యాఖ్యానమ్, 119. గద్యత్రయమ్ - పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానమ్, అనువాదంతో, 120. శ్రీగుణరత్నకోశమ్ - ప్రభ. అణ్ణాస్వామి వ్యాఖ్యానానువాదంతో, 121. సుభాషితనీవి - ఆంధ్రవ్యాఖ్యానమ్ (త్రికరణ్మయి మాసపత్రికలో ధారావాహిక), 122. వాల్మీకి భావదీపం - తెలుగు అనువాదం (గోవిందప్రియ మాసపత్రికలో ధారావాహిక), 123. సహస్రనామ రామాయణం - తెలుగు అనువాదం, 124. ఘటికా-చలవైభవమ్, 125. మేల్‌కోట్టైవైభవమ్, 126. మంగళంపాడు శ్రీ వేణుగోపాలస్వామి వారి సుప్రభాతం, ప్రపత్తి, మంగళాశాశనం - ఆంధ్రానువాదం,

127. శ్రీవరవరమునిశతకం - వ్యాఖ్యానంతో (దేవరాజగురు ప్రణీతమ్), 128. శ్రీరఙ్గరాజస్తవము - ఉత్తరశతకము-భావం 129. కణ్ణినుణ్శిఋత్తాంబు, 130. ఆర్తిప్రబంధం - వ్యాఖ్యానమ్, 131. అష్టశ్లోకి - వ్యాఖ్యానమ్, 132. భగవద్ధ్యాన సోపానమ్ - వ్యాఖ్యానమ్, 133. శ్రీశైలాష్టకమ్ - వ్యాఖ్యానమ్, 134. శ్రీభాష్యసారం, 135. ముదల్‌తిరువన్దాది - వ్యాఖ్యానాలతో, 136. శ్రీవరవరముని నక్షత్రమాలికా - వ్యాఖ్యానమ్, 137. విశిష్టాద్వైత వైభవమ్, 138. శ్రీరామానుజ వైభవమ్, 139. దివ్యసూరి చరితంలో శ్రీరామానుజ వైభవమ్, 140. యతిరాజవింశతి - వ్యాఖ్యానమ్, 141. ఇరామానుశనూ*ఱ్ఱ*న్దాది - శ్రీమణవాళ మహాముునుల వ్యాఖ్యానం, అనువాదంతో, 142. శ్రీనృసింహ వైభవమ్ (నృసింహస్తుతిని చేసే ఆ*ழ్వా*ర్ల పాశురాల సంకలనం), 143. తిరువిరుత్తమ్ - వ్యాఖ్యానంతో, 144. శ్రీమణవాళ మహాముని వైభవమ్, 145. శ్రీహయగ్రీవ స్తుతిమాలికా 146. ఏకశ్లోక వ్యాఖ్య, 147. చరమోపాయ నిర్ణయమ్, 148. చరమోపాయ తాత్పర్యమ్, 140. శ్రీరామానుజ సూక్తిమంజరి, 150. సప్తగాథ వ్యాఖ్యానమ్, 151. జ్ఞానసారం, ప్రమేయసారం - వ్యాఖ్యానమ్, 152. తిరుక్కోళూర్ పెణ్‌పిళ్లై రహస్యమ్, 153. శ్రీవరవరముని స్తుతి సర్వస్వమ్, 154. శ్రీవరవరముని పఞ్చాశత్ - వ్యాఖ్యానమ్, 155. ఆ*ழ్వా*ర్ పాశురాల్లో కూర్మావతార ప్రసక్తి - సవ్యాఖ్యానం, 156. పూర్వదినచర్య, ఉత్తరదినచర్య - సంస్కృత వ్యాఖ్యానంతో, 157. పద్మనాభక్షేత్ర వైభవం, 158. వరద దేశిక వైభవ ప్రకాశిక - మొదటి భాగం, 159. ముదలియాండాన్ వైభవం, 160. దేశికప్రబంధం - వ్యాఖ్యానమ్, 161. భగవద్రామానుజుల ఐతిహ్యాలు, నిర్వాహాలు, వార్తలు - ప్రథమభాగం, 162. శరణాగతిగద్య-శ్రీదేశిక వ్యాఖ్యానానికి అనువాదం, 163. శ్రీవైష్ణవ సౌభాగ్యం - వ్యాఖ్యానమ్, 164. నారాయణ సూక్త వ్యాఖ్యానం, 165. తత్త్వసంగ్రహమ్ - ఆంధ్రానువాదము, 166. శ్రీ రామాయణసారం - ఆంధ్రానువాదము, 167. సంప్రదాయపరిశుద్ధి - ఆంధ్రానువాదము, 168. సాంప్రదాయిక వ్యాస మాలిక-1, 169. సాంప్రదాయిక వ్యాస మాలిక-2, 170. సాంప్రదాయిక వ్యాస మాలిక-3, 171. సాంప్రదాయిక వ్యాస మాలిక-4, 172. కేనోపనిషద్వ్యాఖ్యానము - ఆంధ్రానువాదము, 173. భగవద్రామానుజ దర్శనం - ఆంధ్రానువాదము, 174. భగవద్గీతలో తత్త్వహిత పురుషార్థాలు - ఆంధ్రానువాదము, 175. 108 దివ్య దేశముల తిరుప్పళ్ళియె*ழు*చ్చి - వ్యాఖ్యానంతో, 176. తిరువాయ్

మొழி ప్రబంధ సారం– ఆంధ్రానువాదము, 177. ఇరామానుశనూఱ్ఱన్దాది – ప్రబంధ రక్షా వ్యాఖ్యానం (ఉత్తమూర్ స్వామి) – ఆంధ్రానువాదము 178. అణ్ణంగరార్య వైభవ నుతి మాలికా, 179. అపూర్వ రామాయణం – ఆంధ్రానువాదము, 180. శ్రీ నృసింహ స్తుతి మలికా, 181. తిరుమాలై – సవ్యాఖ్యానం, 182. దయాశతకం – భావం 183. ఎమ్బార్ వైభవం – ఆంధ్రానువాదం 184. అపూర్వ స్తోత్ర కదంబకం – భావం, 185. శ్రీమన్ కందాళ వేంకటాచార్యస్వామి వారి అష్టోత్తర శతనామ స్తోత్రం, నామావళి, 186. భగవద్గీత – టీకా తాత్పర్యం, ప్రశ్నోత్తరావళి 187. భూతపురి మాహాత్మ్యం – ఆంధ్రానువాదం, 188. కోయిల్ పెరియ తిరుమొழி – సవ్యాఖ్యానం, 189. స్తుతిమణి మంజరి – తాత్పర్యంతో, 190. ప్రపన్న స్తోత్ర మాలిక – తాత్పర్యంతో, 191. అలర్మేల్ మంగై ప్రపత్తి, మంగళాశాసనం – వ్యాఖ్యానం, 192. అమృత ఫలావళి శతకం – వ్యాఖ్యానం, 193. సుందరబాహుస్తవం – వ్యాఖ్యానం, 194. గరుడ పఞ్చాశత్ – వ్యాఖ్యానం, 195. కామసికాష్టకం – వ్యాఖ్యానం, 196. అనంతస్తవం – వ్యాఖ్యానం, 197. సంక్షేప రామాయణం – తాత్పర్యంతో, 198. సచిత్ర ఇరామానుశనూఱ్ఱన్దాది – వ్యాఖ్యానం, 199. సచిత్ర సంక్షేప రామాయణం – తాత్పర్యంతో, 200. సచిత్ర తిరుక్కోళూర్ పెణ్పిళ్ళై రహస్యం – వ్యాఖ్యానం, 201. సీతాచరితమ్ – ఆంధ్రానువాదం, 202. సాంప్రదాయిక వ్యాస మాలిక–5, 203. దేహళీశస్తుతి – ఆంధ్రవ్యాఖ్యానం, 204. గీతార్ధసంగ్రహమ్ – ఆంధ్ర వ్యాఖ్యానం, 205. లక్ష్మీ స్తోత్రం – తాత్పర్యం, 206. స్తోత్రరత్నం – సవ్యాఖ్యానం, 207. పురుషసూక్తం – సవ్యాఖ్యానం, 208. వాల్మికి వాగమృతం – ఆంధ్రానువాదం, 209. శ్రీశైలేశ దయాపాత్ర స్తోత్రమ్ – తాత్పర్యం, 210. గోదోపమాష్టకమ్, కృష్ణాష్టకమ్ – సవ్యాఖ్యానం, 211. శ్రీశైలేశదయాపాత్ర పద్య స్తుతి



